ఇంగువ వారి

# గంటల పంచాంగము

## శ్రీ ప్లవ నామ సంవత్సరము

## 2021-22


## బ్రహ్మశ్రీ ఇంగువ రాజేశ్వర శర్మ

## ఇంగువ మురళీ కృష్ణ శర్మ

రావినూతల(పోస్ట్), బోనకల్ మండలం

ఖమ్మం జిల్లా ఫోన్: 9951203662



మా తల్లి తండ్రులు

కీ.శే. బ్రహ్మశ్రీ ఇంగువ వేంకట రాజ్యలక్ష్మీ నారాయణ శాస్త్రి గారు –మహాలక్ష్మి గారు



<u>నా గురుదేవులు</u>

బ్రహ్మశ్రీ నందుల అచ్యుత రామశాస్త్రి గారు



# నామాట

శ్లో॥ బ్రహ్మాచార్యో వసిష్ఠోత్రిర్మనుః పౌలస్త్య లోమశౌ।
మరీచిరంగిరావ్యాసో నారదశ్శౌనకో భృగుః।
చ్యవనో యవనో గర్గః కశ్యపశ్చ పరాశరః।
అష్టాదశైతే గంభీరాః జ్యోతిశ్శాస్త్ర ప్రవర్తకాః॥

జ్యోతిశ్శాస్త్రమును ప్రచురింపజేసిన వారిలో సూర్యుడు, వ్యాసుడు, వశిష్ఠుడు, పరాశరుడు మొదలైన వారు 18 మంది శాస్త్ర వేత్తలని తెలియ బడుచున్నారు. వారిలో సూర్యుడు మొదటివాడు. సూర్యప్రోక్తమైన సూర్య సిద్ధాంతమును పరమప్రమాణముగా స్వీకరించి చాంద్రమానము ననుసరించి

ఈ పంచాంగము నందలి తిథ్యాదులు, వ్రతాదులు నిర్ణయించ బడినవి. సూర్య సిద్ధాంత ప్రాధాన్యతనెరింగి సూర్య సిద్ధాంత గణితముచే సాధించవలెనని స్పష్టముగా నిర్వచించి, వృద్ధి క్షయములు నిర్వచించబడెను. తిథి వృద్ధి–5–30 వి.ఘ., తిథిక్షయము–6–15 వి.ఘ., నక్షత్రవృద్ధి– 6–30 వి.ఘ., నక్షత్రక్షయము– 4–15 వి.ఘ. యోగవృద్ధి– 1–40 వి.ఘ. యోగ క్షయము– 8–0 వి.ఘ. అని వివరించబడెను. దానిని ప్రమాణముగా స్వీకరించి ఈ పంచాంగమందు తిథ్యాదులు చేయ బడినవి. గ్రహణాదులు దృక్సిద్ధికి తగినట్లు జ్యోతిస్సిద్ధాంత సంగ్రహము, కరణ రత్నము అను గ్రంథములననుసరించ బడినవి. గ్రంథ భేదముల వలన గురు, శుక్ర మౌఢ్యములలో భేదములేర్పడి ప్రజలకు సందేహాస్పదమగుచున్నది. కొన్ని పండుగల నిర్ణయములలోనూ, గురు, శుక్ర మౌఢ్యములలోనూ, గ్రహణ విషయములలోనూ, సర్వజన ప్రయోజకముగా అన్ని రకములుగా పరిశీలించి కార్యాకార్యవ్యవస్థతో ఈ పంచాంగము వ్రాయబడినది.

ముఖ్యముగా ప్రాంతీయ పంచాంగములను అనుసరించి పండుగలను పాటించుట వలన దైవదోషముకాక పూర్తి సత్ఫలితములను పొందవచ్చును. ప్రాంతీయ పంచాగముల రీత్యా సూర్యాస్తమయ సూర్యోదయములు నిక్కచ్చిగ గోచరించును, తద్వారా పితృఆరాధన(తిథులను) నిక్కచ్చిగా ఆచరించవచ్చును. ఇది కేవలం ప్రాంతీయ పంచాంగములను అనుసరింటచేతనే సిద్ధించును అని తెలియచేస్తూ విరమిస్తున్నాను.



## సూర్య సిద్ధాన్తము-దృక్ సిద్ధాన్తముల ఆచరణీయమునకు ధర్మశాస్త్ర నిరూపణము

శ్లో॥ ప్రత్యహం తిథి నక్షత్ర యోగస్యానయనే విధు:।
అభిజం సంస్మృతోగ్రాహ్య: గ్రహణాదౌ సబీజక:॥
సిద్ధాన్త గ్రహచారేణ వ్రతాది కాల ఉచ్యతే।
దృక్ సిద్ధ గ్రహ చారేణ ప్రత్యక్ష ఫల చిన్తితం॥
సిద్ధాన్త గ్రహ చారేణ వ్రతధర్మాదికం చరేత్।
దృక్ సిద్ధ గ్రహచారేణ హెూరాఫలముదీరయేత్॥

శ్లో॥ దృక్సిద్ధ ఖేట గ్రహ సాదితాసు। కుర్వన్తి కేచిత్ తిథిషు ప్రమాదాత్।
శ్రాద్ధాదికం తత్ పితృశాప తస్తే। పుణ్యక్షయం దుర్గతిమాప్నువంతి॥

### సూర్య సిద్ధాన్తే స్ఫుటాధికారే

మందాది సాధారణ సంస్కార సంస్కృత అర్కేందుభ్యాం తిథ్యాది సాధన క్రమముపదిశ్య అనన్తరాధికారేషు తత్ సంసస్కృత గ్రహోత్క్రాంతిచ్ఛాయాచర దళాదికం స్ఫుటం దృక్తుల్యతాం గచ్ఛేదయనే విషువద్వయే।

నక్షత్ర గ్రహ యోగేషు గ్రహాస్తోదయ సాధనే శృగోస్సృతౌతు చంద్రస్య దృక్కర్మాదౌ విదంస్మృతం।

**రవ్యాది నవగ్రహములలో రవిచంద్రులను మినహా తక్కిన గ్రహములకు బీజ సంస్కారము చేయవలెను.**

**కర్మసాక్షిభూతులై ప్రత్యక్షదైవతములగు రవి చంద్రులకు బీజ సంస్కారము తిథ్యాది పంచాగానయనము నందు చేయనవసరములేదని పై వాక్యములనుండి తెలియుచున్నది.**

### బీజసంస్కార కరణీయ సందర్భా: నిరూప్యతే

శ్లో॥ మాందైక కర్క సంశుద్ధవ్యర్కేందూత్పాదితా తిథి:।
శ్రాద్ధాదిషు పరిగ్రాహ్యా గ్రహణాదౌతు బీజయుక్॥

దృక్సిద్ధ సూర్యచంద్రులచేత సాధింపబడిన తిథ్యాదులు వైదిక కర్మార్హమైనవికావు అని పై శ్లోకమునుండి తెలియ వచ్చుచున్నది.

## బీజ సంస్కార కరణీయ సందర్భా:

శ్లో॥ గ్రహణే గ్రహ యోగేచ కాలభా లగ్న సాధనే।
శృంగోన్నత్యుదయాస్తేషు గ్రహేబీజం విధీయతే॥

దృష్ట కర్మోపయోగియగు సూర్యచంద్రగ్రహణాదులయందు గ్రహసమాగమ శృంగోన్నత్యుదయాస్తమయ ఛాయా రవ్యాది సాధనమున బీజ సంస్కారము చేయవలెను.

శ్లో॥ తిథ్యాది సాధనే క్వాపి నార్కేంద్వోర్బీజయోగితా।
అన్యధా సయనార్కస్య రాశి సంక్రమ సంభవే॥

శ్లో॥ శుద్ధ సంక్రమణ శ్రాద్ధం ప్రసజ్యేత నయుజ్యతే।
ప్రత్యహం తిథి నక్షత్ర యోగస్యానయనే విధు:।
అబీజ సంస్కృతో గ్రాహ్యో గ్రహణాదౌ సబీజక:॥

శ్లో॥ యంత్రవేధాదినాజ్ఞాతం యత్పూర్వం గణకైస్తతః।
గ్రహణాది పరిక్షేత నతిథ్యాది కదాచన॥

భచక్ర చలనము వలన గ్రహములయందు గతివ్యత్యాసములు కనబడుచున్నవి. అందువల్ల బీజమనగా మధ్యగతి వ్యత్యాసమును చక్కబరచునట్టి కర్మ. ఈ కర్మ తిథ్యాది పంచాంగానయనమునందు చేయనక్కరలేదు. గ్రహణాదులైనటువంటి దృష్ట కర్మలయందు బీజసంస్కారము తప్పక చేయవలెను.

శ్లో॥ అతస్స్వదేశ దృక్సిద్ధ తిథౌ శ్రాద్ధం నచాచరేత్।
భచక్రనాభి దృక్సిద్ధే కుర్యాత్ శ్రాద్ధ వ్రతాదికమ్।
తస్మాత్ కేవల దృక్సిద్ధేనైవ శ్రాద్ధాదికం చరేత్॥

శ్లో॥ దృక్సిద్ధ ఖేట గ్రహ సాదితాసు। కుర్వన్తి కేచిత్ తిథిషు ప్రమాదాత్।
శ్రాద్ధాదికం తత్ పితృశాప తస్తే। పుణ్యక్షయం దుర్గతిమాప్నువంతి॥

శ్లో॥ తిథేస్తు పంచ ఘటికాపర్యంతం వృద్ధి సంజ్ఞకమ్।
తత్తిథేస్తర్క ఘటికా పర్యంతం క్షయ సంజ్ఞకామ్।
ఏతద్వృద్ధి క్షయే కించిద్వైషమ్యమదివీక్షితమ్॥

పై ప్రమాణముల రీత్యా తిథి వృద్ధి ఐదు ఘటికలు తిథి క్షయము 6 ఘటికలు,(బాణవృద్ధి రస క్షయ:) మాత్రము ఉండునని శాస్త్ర వచనము. నేడు దృగ్గణిత పంచాంగములని చెప్పుకుంటున్నవి ఈ ప్రమాణమును అనుసరించుటలేదు. అలా అనుసరించకపోవటం వలన తిథి గణితమున పరిధులు ఉండవు. వృద్ధిక్షయములకు ఒక ప్రమాణమంటూ ఉండదు. దానివలన ఒక్కొకచో, తిథి ఉభయత్రా(రెండు రోజులలో) అపరాహ్ణవ్యాపి అయి ఉండకపోవు ప్రమాదము సంభవించును అలా లేనిచో అపరాహ్ణ సమయ ప్రధానములగు శ్రాద్ధాదులు అచరింప సాధ్యము కాదు. అలానే వ్రతాదులలో సైతం వ్యత్యాసము ఏర్పడును.

పైన ఉదహరించిన శ్లోకాదులలో దృక్సిద్ధ గ్రహములననుసరించి శ్రాద్ధము, వ్రతాదులు అచరింపకూడదని సైతం స్పష్టమగుచున్నది. కాబట్టి అనాదిగా శిష్టానుమోదమగు సూర్యసిద్ధాంతపూర్వగణితమును ఆచరించుట సర్వవిధాలా శ్రేయోదాయకమని ప్రతిపాదన చేస్తూ విరమిస్తున్నాను.



శ్రీరస్తు శుభమస్తు అవిఘ్నమస్తు

## నవగ్రహ స్తోత్రము

రవి: జపాకుసుమ సంకాశం కాశ్యపేయం మహద్యుతిమ్।
తమోరిం సర్వ పాపఘ్నం ప్రణతోస్మి దివాకరమ్ ॥6॥

చంద్ర: దధి శంఖ తుషారాభం క్షీరోదార్ణవ సంభవమ్।
నమామి శశినం సోమం శంభోర్మకుట భూషణమ్ ॥10॥

కుజ: ధరణీ గర్భ సంభూతం విద్యుత్కాంతి సమ ప్రభమ్।
కుమారం శక్తి హస్తం తం మంగళం ప్రణమామ్యహమ్ ॥7॥

బుధ: ప్రియంగు కలికాశ్యామం రూపేణా ప్రతిమం బుధమ్।
సౌమ్యం సౌమ్యగుణోపేతం తంబుధంప్రణమామ్యహమ్ ॥17॥

గురు: దేవానాంచ ఋషీణాంచ గురుం కాంచన సన్నిభమ్।
బుద్ధిమంతం త్రిలోకేశం తం నమామి బృహస్పతిమ్ ॥16॥

శుక్ర: హిమకుంద మృణాలాభం దైత్యానాం పరమం గురుమ్।
సర్వశాస్త్ర ప్రవక్తారం భార్గవం ప్రణమామ్యహమ్ ॥20॥

శని: నీలాంజన సమాభాసమ్ రవిపుత్రమ్ యమాగ్రజమ్।
ఛాయామార్తాండసమ్భూతమ్ తంనమామిశనైశ్చరమ్ ॥19॥

రాహు: అర్ధకాయం మహావీర్యం చంద్రాదిత్య విమర్దనమ్।
సింహికాగర్భసంభూతం తంరాహుం ప్రణమామ్యహమ్ ॥18॥

కేతు: ఫలాశ పుష్ప సంకాశం తారకా గ్రహ మస్తకమ్।
రౌద్రం రౌద్రాత్మికం ఘోరం తంకేతుం ప్రణమామ్యహమ్ ॥7॥

**ఫలస్తుతి:** ఇతి వ్యాస ముఖోద్గీతం యః పఠేత్సుసమాహితః।
దివా వా యది వా రాత్రౌ విఘ్నశాన్తిర్భవిష్యతి॥
నరనారీ నృపాణాన్చ భవేద్దుస్వప్న నాశనమ్।
ఐశ్వర్యమతులం తేషాం ఆరోగ్యం పుష్టివర్ధనమ్॥
గ్రహనక్షత్రజాః పీడాః తస్కరాగ్నిసముద్భవాః।
తాస్సర్వాః ప్రశమం యాన్తి వ్యాసోబ్రూతే నసంశయః॥

## అధిదేవతా ప్రత్యధిదేవతా సహిత నవగ్రహ స్తోత్రమ్

శ్లో॥ గణానాం గణపం దేవం బ్రహ్మాణాం బ్రహ్మాణస్పతిమ్।
కవీనాం సుకవిం సర్వవిఘ్న శాన్త్యై నమామ్యహమ్॥

శ్లో॥ దేవీ సరస్వతీ విద్యాం వాజ(చ)ం యా నః ప్రయచ్ఛతి।
ధీనామవిత్రీ వేదైక వేద్యాం తాం ప్రణమామ్యహమ్॥

శ్లో॥ బ్రహ్మావిష్ణుశివాత్మాచ పరబ్రహ్మాత్మకశ్చయః।
విద్యా బుద్ధి ప్రదోస్మాకం శ్రీగురుస్తం నమామ్యహమ్॥

### సూర్యః

శ్లో॥ అమర్త్య మర్త్యాన్ సంరక్షన్ సత్యేన స్వక తేజసా।
లోకాన్విపశ్యన్నాయాతి సవితా తం నమామ్యహమ్॥

శ్లో॥ సూర్యగ్రహాధిదేవం తం హోతారం విశ్వవేదసమ్।
సుక్రతుంహ్యస్య యజ్ఞస్య అగ్నిం దూతం నమామ్యహమ్॥

శ్లో॥ శ్రేష్ఠో మీఢుష్టమస్తవ్యః ప్రచేతాశ్శంతమశ్చ యః।
సూర్య ప్రత్యధి దేవం తం కద్రుద్రం ప్రణమామ్యహమ్॥

### చన్ద్రః

శ్లో॥ ఆప్యాయస్వానిశం సోమ విశ్వతోన్నరసైస్తథా।
వాజస్యచ సమృధ్యై త్వం భవ నస్త్వాం నమామ్యహమ్॥

శ్లో॥ చన్ద్రాధిదేవతా ఆపః సర్వారిష్ట నివారకాః।
విశ్వశంభ్వగ్నిజా స్సోమస్తుతాస్తాః ప్రణమామ్యహమ్॥

శ్లో॥ చన్ద్ర ప్రత్యధి దేవి యా సర్వవర్ణ పదాత్మికా।
తక్షతీ మాతి సకలం గౌరీ తాం ప్రణమామ్యహమ్॥

### కుజః

శ్లో॥ అగ్నిరూపో దివో మూర్ధా పృధివ్యాః పాలకశ్చయః।
సంప్రీణయతి భూతాని కుజస్తం ప్రణమామ్యహమ్॥

శ్లో॥ సమస్తభూత జననీ పాలనీ శర్మదాక్షమా।

కుజగ్రహాధిదేవీ యా పృథ్వీ తాం ప్రణమామ్యహమ్॥

శ్లో॥ గోశ్వాది పోషకంయేన హితేనేవ జయామహే।
కుజ ప్రత్యధిదేవం తం క్షేత్రపాలం నమామ్యహమ్॥

## బుధః

శ్లో॥ ఉద్బుధ్యస్వ బుధాగ్నే నః ఇష్టాపూర్తే చ సంసృజ।
యూనస్సమర్ధాన్ యగ్నేషు కురునస్త్వాం నమామ్యహమ్॥

శ్లో॥ బుధాధిదేవతా యస్య త్రేధాన్యస్తే పదేశివే।
పాంసుభూతాస్సమే లోకాః విష్ణుం తం ప్రణమామ్యహమ్॥

శ్లో॥ విశ్వరూపోతి విశ్వశ్చ పురుషశ్చ విరాట్వ్యయమ్।
బుధ ప్రత్యధి దేవోసి నారాయణ నమోస్తుతే॥

## గురుః

శ్లో॥ బృహస్పతే క ప్రజాత కృపయాస్మాసు యష్మ్టషు।
క్రతుమద్ద్రవిణంధేహి చిత్రం చ త్వాం నమామ్యహమ్॥

శ్లో॥ ప్రధమం సర్వభూతానాం మనోజ్ఞం సర్వభాసకమ్।
గురుగ్రహాధిదేవత్వే స్థితం బ్రహ్మ నమామ్యహమ్॥

శ్లో॥ విశ్వోత్కృష్టశ్చ భక్తానాం పుత్ర పౌత్రాదికప్రదహ।
గురుప్రత్యధిదేవశ్చ ఇన్ద్రం తం ప్రణమామ్యహమ్॥

## శుక్రః

శ్లో॥ రుద్ర శుక్ర మహాతేజః పూషన్ మాయా అవస్యహో।
నైకరూపద్యో రివాసి భద్రరాతే నమోస్తుతే॥

శ్లో॥ సుపత్నీం దేవతాస్త్రీషు సౌమంగల్యప్రదాం నృణామ్।
శుక్రగ్రహాధిదేవీం తాం ఇన్ద్రాణీం ప్రణమామ్యహమ్॥

శ్లో॥ శుక్రప్రత్యధిదేవో యః ప్రీతశ్శర్యాతి యా గతః।
ఇన్ద్రం మరుద్గణైర్యుక్తం సుకవీష్టం నమామ్యహమ్॥

## శనిః

శ్లో॥ శమగ్నిశ్శముసూర్యో నః శంవాతశ్చ ప్రయచ్ఛతి।
శనేత్వద్ధయయాస్మాకం అనిశం శం నమోస్తుతే॥

శ్లో॥ యదర్ధే జుహుయాత్సోమం శుభాయ జుహుయాద్ధవిః।
శనిగ్రహాధిదేవో యో యమం తం ప్రణమామ్యహమ్॥

శ్లో॥ యస్మాత్పరో నాస్తి యస్మాత్ సర్వాన్కామాన్ లభామహే।
శనిప్రత్యధి దేవం తం నమామి శ్రీ ప్రజాపతిమ్॥

## రాహుః

శ్లో॥ రాహో తమస్స్వరూపస్త్వం చిత్రం తేనుగ్రహోదయమ్।
యజ్ఞో విరాజతేస్మాకం దివ్యం త్వాం ప్రణమామ్యహమ్॥

శ్లో॥ గౌః పృశ్నిరక్రమిద్గార్హపత్యోగ్నిః పృథివీం దివమ్।
రాహుగ్రహాధిదేవం తం అగ్నిం గాం ప్రణమామ్యహమ్॥

శ్లో॥ పృథివ్యామన్తరిక్షే చ దివి సర్పన్తి యే సదా।
రాహు ప్రత్యధిదేవాశ్చ సర్పాన్ తాన్ ప్రణమామ్యహమ్॥

## కేతుః

శ్లో॥ అకేత్వపి సుకేతుస్యాత్ కార్యం కేతోఃప్రసాదతః।
శోభాశ్రేష్ఠత్వ కేతుర్యః తం త్వాం కేతుం నమామ్యహమ్॥

శ్లో॥ చిత్రో విచిత్రో యోహ్యగ్నిః చిత్రశ్రేష్ఠ ఫలప్రదః।
కేతుగ్రహాధిదేవం తం చిత్రగుప్తం నమామ్యహమ్॥

శ్లో॥ దేవర్షి కవి ముఖ్యేభ్యః సర్వేభ్యోపిచ పావకః।
కేతుప్రత్యధి దేవశ్చ బ్రహ్మా యస్తం నమామ్యహమ్॥

## పునః ప్రార్థన

శ్లో॥ నవగ్రహాన్ తదీయాధిదేవాన్ సర్వాన్ దయామయాన్।
తత్తత్ప్రత్యధి దేవాంశ్చ ప్రణమామి పునః పునః॥
తే సర్వే లోక రక్షైక దీక్ష దక్ష దయామయాః।
స్తోత్రేణానేన సంతుష్టాః పాన్త్వస్మాన్ సర్వధా సదా॥

శ్లో॥ ఆదిత్యాయచ సోమాయ మంగళాయ బుధాయచ।
గురు శుక్ర శనిభ్యశ్చ రాహవే కేతవే నమః॥

## శ్రీ గణేశ స్తుతి

శ్లో॥ అగజానన పద్మార్కం గజాననమహర్నిశమ్।
అనేకదం తం భక్తానాం ఏకదంతముపాస్మహే॥

## శ్రీ మహావిష్ణు స్తుతి

శ్లో॥ శాంతాకారం భుజగశయనం పద్మనాభం సురేశమ్।
విశ్వాకారం గగన సదృశం మేఘవర్ణం శుభాంగమ్।
లక్ష్మీకాంతం కమలనయనం యోగి హృద్ధ్యానగమ్యమ్।
వందే విష్ణుం భవభయ హరం సర్వలోకౌకనాధమ్॥

## శ్రీ శివలింగ దర్శనము చేయునపుడు

శ్లో॥ నమశ్శివాయ సాంబాయ సగణాయాది హేతవే।
రుద్రాయ విష్ణవే తుభ్యం బ్రహ్మణే సూర్య మూర్తయే॥
వాగర్థావివ సంపృక్తౌ వాగర్థ ప్రతిపత్తయే।
జగత్ణ పితరౌ వన్దే పార్వతీ పరమేశ్వరౌ॥

## లక్ష్మీ నృసింహ ధ్యానమ్

శ్లో॥ ఉగ్రం వీరం మహావిష్ణుం జ్వలంతం సర్వతోముఖమ్।
నృసింహం భీషణం భద్రం మృత్యు మృత్యుం నమామ్యహమ్॥

## నందీశ్వర ప్రార్థన

శ్లో॥ నందీశ్వర నమస్తేస్తు సాంద్రానంద ప్రదాయక।
మహాదేవస్య సేవార్థం అనుజ్ఞాం దాతుమర్హసి॥

## ఇంటినుండి కార్యార్థముగా బోవునపుడు

శ్లో॥ యశ్శివో నామ రూపాభ్యాం యా దేవీ సర్వమంగళా।
తయో సంస్మరణాత్పుంసాం సర్వతో జయమంగళమ్॥
లాభస్తేషాం జయస్తేషాం కుతస్తేషాం పరాభవః।
యేషామిందీవరస్యామో హృదయస్తో జనార్దనః॥

## సంధ్యాసమయమున దీపము వెలిగించునపుడు

శ్లో॥ దీపం జ్యోతి పరబ్రహ్మం దీపం సర్వ తమోపహమ్।
దీపేన సాధ్యతే సర్వం సంధ్యాదీపం నమోస్తుతే॥

## జమ్మిచెట్టు ప్రదక్షిణ సమయమున

శ్లో॥ శమీ శమయితే పాపం శమీ శత్రు వినాశినీ।
అర్జునస్య ధనుర్ధారీ రామస్య ప్రియదర్శినీ॥

## రావిచెట్టు ప్రదక్షిణము

శ్లో॥ మూలతో బ్రహ్మరూపాయ మధ్యతో విష్ణురూపిణే।
అగ్రతః శివరూపాయ వృక్ష రూపాయతే నమః॥

## ఔషధ సేవన చేయునపుడు

శ్లో॥ ధన్వంత్రిణం గరుత్మంతం ఫణిరాజంచ కౌస్తుభమ్।
అచ్యుతంచామృతం చంద్రం స్మరేదౌషధకర్మణి॥
శరీరే జర్జరీ భూతే వ్యాధిగ్రస్తే కళేబరే।
ఔషధం జాహ్నవీతోయం వైద్యో నారాయణో హరిః॥

## రహస్యముగా యుంచదగినవి

శ్లో॥ ఆయుర్విత్తం గృహచ్ఛిద్రం మన్త్రమౌషధ సంగమమ్।
దానమానావమానశ్చ నవగోప్యా మనీషిభిః॥

ప్రతివ్యక్తీ, తనయొక్క వయస్సు, ధనసంపాదన, కుటుంబం లోని కలహములు, తాను చేసే దైవారాధన, తీసుకునే ఔషధము, సంగమము, చేసిన దానధర్మములు, తాను పొందిన గౌరవావమానములు, ఇతరులతో గొప్పగా చెప్పకూడదు. చెప్పిన యెడల తనకే హాని కల్గును.

## యజ్ఞోపవీత ధారణ మంత్రము

మంత్రం: ఓం యజ్ఞోపవీతం పరమం పవిత్రం ప్రజాపతేర్యత్సహజం పురస్తాత్। ఆయుష్యమగ్ర్యం ప్రతిముంచ శుభ్రం యజ్ఞోపవీతం బలమస్తు తేజః॥

## యజ్ఞోపవీత విసర్జన మంత్రము

శ్లో॥ ఉపవీతం ఛిన్నతంతుం జీర్ణకం మల దూషితమ్।
విసృజామి యశో బ్రహ్మవర్చో దీర్ఘాయురస్తుమే॥

## నూతన యజ్ఞోపవీతము ధరించు సమయములు

జాతాశౌచ శుద్ధి అనంతరము, మృతాశౌచ శుద్ధి అనంతరము, శవస్పర్శ కలిగినచో, గ్రహణానంతరం, శ్రావణపూర్ణిమ రోజున, నూతన యజ్ఞోపవీతమును ధరించవలెను.

## మృత్యుంజయ ధ్యానము

శ్లో॥ హస్తాంబోజ యుగస్థ కుంభ యుగలాదుద్ధృత్య తోయమ్ శిరః।
సించితమ్ కరయోర్యుగేన దధతం స్వాంకేశ కుంభౌ కరౌ।
అక్షస్రక్ మృగహస్తమంబుజగతమ్ మూర్ధస్థ చంద్రస్రవత్।
పీయూషార్ద్రతనుమ్ భజేశ గిరిజమ్ త్ర్యక్షంచ మృత్యుంజయమ్॥

శ్లో॥ కైలాసే కమనీయ రత్నఖచితే కల్పద్రు మూలే స్థితమ్।
కర్పూర స్ఫటికేన్దు సున్దర తనుమ్ కాత్యాయనీ సేవితమ్।
గంగా తుంగ తరంగ రంజిత జటాభారమ్ కృపాసాగరమ్।
కంఠాలంకృత శేషభూషణ మహామృత్యుంజయమ్ భావయే॥

## సర్ప దోష నివృత్తికై

శ్లో॥ యోదేవస్సర్వభూతానాం ఆత్మాహ్యారాధ ఏవచ।
గుణాతీతో గుణాత్మాచ సమే నాగ ప్రసీదతు॥
నాగరాజ మహాదేవ కృపయా భక్తవత్సల।
అభీష్టం దేహిమే దేవ సర్పరూప నమోస్తుతే॥
నాగాధిప నమస్తేస్తు సర్వారిష్ట వినాశన।
సర్పదోషం శమయేద్దేవ వాంఛితార్థాన్ ప్రయచ్ఛమే॥
ప్రసన్నం పాహిమాం భక్త్యా కృపాళో దీన వత్సల।
జ్ఞానతోజ్ఞానతోవాపి కృతస్సర్ప వధోమయా॥

# శ్రీ ప్లవ నామ సంవత్సర నిర్ణయ పీఠిక

**శ్లో॥ అబ్దాదౌ బంధు సంయుక్తో మంగళస్నానమాచరేత్।**
**వస్త్రైరాభరణైర్దేహమలంకృత్య తతశ్శుచిః॥**
**విఘ్నేశం భారతీం ఖేటాన్ దైవజ్ఞమభిపూజ్యచ।**
**సంవత్సర ఫలం సమ్యక్ శృత్వా విప్రాన్ సమర్చయేత్॥**
**యద్వర్షాదౌ నిమ్బకుసుమం శర్కరామ్లఘృతైర్యుతమ్।**
**భక్షితం పూర్వయామేన తద్వర్షం సౌఖ్యదాయకమ్॥**

సమస్త జగదుత్పత్తి స్థితిలయ హేతుభూతస్య, అనన్తవీర్యస్య శ్రీమదాది నారాయణస్య, నాభిసరోజే విరాజమానస్య సకల జగదుత్పత్తి హేతోః కరణ బ్రహ్మణః పరమాయుర్వర్షశతం, తదర్ధం గతం, ద్వితీయపరార్ధే ప్రథమవర్షే, ప్రథమమాసే, ప్రథమ పక్షే, ప్రథమ దివసే, ప్రథమేహని, ద్వితీయయామే, తృతీయ ముహూర్తే, శ్వేతవరాహ కల్పే, వైవస్వత మన్వంతరే, అష్టావింశన్మహాయుగాన్తర్గత కలియుగే ప్రథమపాదే, ఏతత్ ప్లవ నామ సంవత్సరారంభ పర్యంతం;

| | |
|---|---|
| సృష్ట్యాది గత సౌరాబ్దాః | - 1955885121 |
| వైవస్వత మన్వాది గత సౌరాబ్దాః | - 120533121 |
| కల్యాది గత సౌరాబ్దాః | - 5121 |
| ప్రభవాది గత సౌరాబ్దాః | - 33 |
| శంకరాచార్య అవతారాది గత సౌరాబ్దాః | - 2092 |
| శాలివాహన శకాది గత సౌరాబ్దాః | - 1942. |

అస్మిన్ ఆన్ధ్రదేశే సకల శ్రౌత స్మార్త నిత్య కామ్య కర్మానుష్ఠానార్థం; చాన్ద్రమాన, సౌరమాన, సావనమాన, నాక్షత్రమాన, బార్హస్పత్యాది మానాదితః చాన్ద్రమానం అనుసరణీయం. స్వస్తిశ్రీ చాన్ద్రమానేన హూణ,దిః13-04-2021 ప్రభృతి శ్రీ ప్లవ నామక సంవత్సరః ప్రారంభ్యతే. అపి, పంచవత్సరాత్మక యుగ గణితానుసారేణ, రుద్ర దేవతాకం ఇద్వత్సర సంజ్ఞికం, సకల శోభన దాయక, నృపైః సంతోషదాయక, అధిక వర్ష ప్రదాయక ప్లవ నామ సంవత్సరః.

# శ్రీ ప్లవ నామ సంవత్సర ఫలితములు

| | | | |
|---|---|---|---|
| బుల | రచం శు | రాకు | |
| గు | జగల్లగ్నం | | |
| శ | | | |
| | కే | | |

| | | | |
|---|---|---|---|
| బుర | లచం శు | రాకు | |
| గు | వర్షలగ్నం | | |
| శ | | | |
| | కే | | |

శ్లో॥ చలితాచల సంకాశైః పయోదైరావృతం నభః।
దీప్యంతి సతతంభూపాః ప్లవాబ్దే ప్లవగాజనాః॥

శ్లో॥ ధనధాన్య సమాయుక్తం జగత్సర్వం చరాచరమ్।
మేఘాశ్చ ప్రబలాజ్ఞేయాః ప్లవ సంవత్సరే ప్రియే॥

ఈ సంవత్సరమున పర్వతాకారముతో ఉన్న మేఘములు ఆకాశమున సంచరించుచూ మంచి వర్షములనిచ్చును. రాజులు ప్రజలు సంతోషించెదరు. ధనధాన్య సమృద్ధి, పాడిపంటలభివృద్ధి యుండును. సుభిక్ష, క్షేమారోగ్యములుండును.

ప్లవ సంవత్సరాధిపతి బుధుడు. చైత్రములో వర్షములండును. వైశాఖమున ప్రజాకల్లోలములుండును. అగ్నిబాధలు, రోగపీడలు, జ్యేష్ఠమున ఆహారధాన్యముల ధరలు సరసము. ఆంధ్రదేశమునందు తూర్పు జిల్లాలలో ప్రజాకల్లోలము. ఆషాఢమున వాయు సహిత వృష్టి. భయోత్పాతములు, రోగములు, శ్రావణమున అత్యధిక వర్షములు. భాద్రపదమున ధాన్యముల ధరలు తగ్గును. ఆశ్వయుజమున సమస్త వస్తువుల ధరలు, సమస్త ధాతువుల ధరలు సరసము. ఆహార ధాన్యములకు మాత్రము ధరలు పెరుగును. కార్తీకమున ఆహార ధాన్యముల ధరలు తగ్గును. పౌషాది మాసత్రయమున సుభిక్ష, క్షేమారోగ్యములుండును.

ఈ సంవత్సరము చైత్ర బ॥అష్టమి నుండి వైశాఖ బ॥ విదియ వరకూ వాస్తు కర్తరి. వత్సరాది నుండి చైత్రబ॥ పంచమి వరకూ శుక్ర మౌఢ్యమి, మార్గశిర బ॥ చతుర్దశి నుండి పుష్య శు॥ నవమి వరకూ శుక్ర మౌఢ్యమి, మాఘ బ॥ పంచమి నుండి ఫాల్గుణ బ॥ సప్తమి వరకూ గురు మౌఢ్యమి సంభవించును.

కార్తీక బ॥ తదియ నుండి సింధూనదీ పుష్కరారంభము. ఈ సంవత్సరము మనకు కనిపించు గ్రహణములు లేవు.

2 తూముల వర్షము, 2 తూముల గాలి, 12 వీసముల పంట ఫలించును.

ఈ విధమైన సంవత్సర ఫలితముతో పరమేశ్వరానుగ్రహముతో ప్రజలందరూ సుఖశాంతులతో సుభిక్షముగా జీవించెదరుగాక.

ఉగాదినాడు అభ్యంగన స్నానమాచరించి, నూతన వస్త్రములను ధరించి, అభరణములను ధరించి, బంధువులతో కూడి విఘ్నేశ, సరస్వతి, రాశి, నవగ్రహములను, సిద్ధాంతులను పూజించి సిద్ధాంతిమహోదయుల నుండి సంవత్సర ఫలితములను, పంచాంగ శ్రవణమును గావించి, ఉగాది పచ్చడి (నిమ్బకుసుమ) భక్షణము చేయుట శాస్త్రము యందు విధింపబడ్డదికావున అలా ఆచరించుట సకల సుఖములను ఇచ్చును.

సర్వేషాం సన్మంగళాని భవన్తు
సర్వేజనాస్సుఖినోభవన్తు



# రాజాది నవనాయక నిర్ణయః

1. రాజా కుజః
2. మంత్రీ బుధః
3. సేనాధిపః కుజః
4. సస్యాధిపః శనిః
5. ధాన్యాధిపః గురుః
6. అర్ఘాధిపః కుజః
7. మేఘాధిపః కుజః
8. రసాధిపః రవిః
9. నీరసాధిపః శనిః

## రాజాది నవనాయక ఫలితములు

రాజా కుజః:- శ్లో॥ అగ్నితస్కర రోగాస్యుర్నృప నిగ్రహతాభృశమ్।
హతసస్యో బహువ్యాళో భౌమే వర్షాధిపేసతి॥

ఈ సంవత్సరమునకు రాజు కుజుడగుట వలన అగ్నిభయము, దొంగలవలన భయము, రోగములు, రాజ విరోధము, అధికమగును. భూమి సస్యరహితమగును. సర్పభయమధికముగానుండును.

మంత్రీ బుధః:-శ్లో॥ వాయునాపీడితా మేఘాస్సర్వేపాపరతానరాః।
సోమ పుత్రస్య మంత్రిత్వే జాయతే మధ్యమం ఫలమ్॥

బుధుడు మంత్రియగుటచే మబ్బులు వాయువుతో కూడియుండును. నరులు పాపవంతులుగనుందురు. పై ఫలములు మధ్యమములైయుండును.

సేనాధిపఃకుజః-శ్లో॥ ఆతంకపీడాభువిసస్యనాశః లోకాస్సమస్తాజ్వరితాభవన్తి।
అత్యంతయుద్ధం క్షితి పాలకానాం కుజేచ సేనాధిపతౌ ధరిత్ర్యామ్॥

కుజుడు సేనాధిపతియైయుండిన జనులకతిపీడలు, సస్యనాశత్వము, సమస్త జనులకు జ్వరపీడయూ, రాజులకు పరస్పర యుద్ధములునూ కల్గును.

సస్యాధిపఃశనిః-శ్లో॥ తిలమాష కుళుత్థాది కృష్ణధాన్యాని యానిచ।
కృష్ణభూమిస్సుఫలినీ శనౌ సస్యాధిపే సతి॥

శని సస్యాధిపతియైనందున నువ్వులు మినుములు ఉలవలు మొదలగు నల్లని ధాన్యములు పూర్తిగా పండును. నల్లని నేల ఫలించును.

ధాన్యాధిపఃగురుఃశ్లో॥ సువృష్టిస్సర్వదేశానాం సర్వసస్య సమృద్ధయః।
భవంతి గావస్సుదుఘా గురౌ ధాన్యాధిపే సతి॥

గురుండు ధాన్యాధిపతియైన దేశములందన్నిటియందు సర్వ సస్య సమృద్ధియూ సువృష్టియూ గల్గి గోవులు పూర్తిగ పాలిచ్చును.

అర్ఘాధిపఃకుజః–శ్లో॥ భౌమేచార్ఘపతౌ స్వల్పవృష్టిర్వాయు సమన్వితా।
క్వచిద్వృష్టి క్వచిద్ధాన్యం ప్రజారోగ్యం క్వచిత్ క్వచిత్॥

కుజుడు అర్ఘాధిపుడైన స్వల్పవృష్టియూ వాయువుతో గూడి అచ్చటచ్చట వర్షము కురియును ధాన్యము జన క్షేమంబు కొంతమాత్రమేయుండును.

మేఘాధిపఃకుజఃశ్లో॥ మహావాయురనర్ఘంచస్వల్పవర్షం తథాభువి।
రక్తసస్యాని జాయంతే భౌమే మాఘాధిపే సతీ॥

కుజుడు మేఘాధిపుడైన గాలి అధికమగును. వెలలు తగ్గుఉను. వర్షము స్వల్పమగును. ఎర్రని ధాన్యములు ఫలించును.

రసాధిపఃరవిః–శ్లో॥ తిలతైల గుడక్షారాద్యనేక రసజాతయః।
శూన్యార్ఘం యాంతితే సర్వే రవౌ యది రసాధిపే॥

రవి రస నాయకుండైన తిలలు నూనె బెల్లము, ఉప్పు, మొదలగు రస జాదులకు వెలలు తగ్గును.

నీరసాధిపఃశనిఃశ్లో॥ శృంగాస్మపలలం దారు లోహపాత్రాణి యానిచ।
అనర్ఘం యాంతి సర్వత్ర శనౌ నీరస నాయకే॥

శని నీరసాధిపతి యైన కొమ్ము, రాయి, మాంసము, కర్రపాత్రలు, లోహపాత్రలు అంతటా వెలలు తగ్గి యుండును.



## ఉపనాయక నిర్ణయః

| | | |
|---|---|---|
| అశ్వాధిపః – కుజః | గజాధిపః – కుజః | ఆజ్ఞాధిపః –కుజః |
| పశ్చాత్సస్యాధిపః – శుక్రః | సైన్యాధిపః – శుక్రః | ద్విపాధిపః–కుజః |
| యుద్ధాధిపః – కుజః | పూర్వసస్యాధిపః – శుక్రః | రత్నాధిపః –శుక్రః |
| పశ్వాధిపః – శుక్రః | ఉత్తరాధిపః – శుక్రః | దేవాధిపః –శుక్రః |
| మాంగల్యాధిపః – రవిః | యుద్ధాధిపః – కుజః | సర్పాధిపః –కుజః |
| స్త్రీణామధిపః – కుజః | పశ్చాత్సస్యాధిపః – గురుః | వృషాధిపః–గురుః |
| మృగాధిపః – గురుః | గ్రహాధిపః – శుక్రః | నరాధిపః –శుక్రః |
| వరాధిపః – శుక్రః | వస్త్రాధిపః – రవిః | ఉష్ణాధిపః –రవిః |
| వ్యవహారాధిపః – రవిః | వ్యాపారాధిపః – చంద్రః | ధనాధిపః –చంద్రః |
| తృణాధిపః – చన్ద్రః | వృక్షాధిపః – కుజః | పురోహితః–రవిః |

## కందాయ ఫలితములు

| అశ్వ | భర | కృత్తి | రోహి | మృగ | ఆర్ద్ర | పున | పుష్య | ఆశ్లే | మఖ | పుబ్బ | ఉత్తర | హస్త | చిత్త |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| 5 | 0 | 3 | 6 | 1 | 4 | 7 | 5 | 0 | 3 | 6 | 1 | 4 | 7 |
| 1 | 2 | 0 | 1 | 2 | 0 | 1 | 2 | 0 | 1 | 2 | 0 | 1 | 2 |
| 1 | 4 | 2 | 0 | 3 | 1 | 4 | 2 | 0 | 3 | 1 | 4 | 2 | 0 |

| స్వా | విశా | అనూ | జ్యే | మూ | పూ | ఉషా | శ్రవ | ధని | శత | పూభా | ఉభా | రే |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| 5 | 0 | 3 | 6 | 1 | 4 | 7 | 5 | 0 | 3 | 6 | 1 | 4 |
| 0 | 1 | 2 | 0 | 1 | 2 | 0 | 1 | 2 | 0 | 1 | 2 | 0 |
| 3 | 1 | 4 | 2 | 0 | 3 | 1 | 4 | 2 | 0 | 3 | 1 | 4 |

మొదట సున్నా ఉన్నచో మహావ్యాధి(భయం), మధ్య సున్నా ఉన్నచో మనో వ్యథ(ఋణాధికం), చివర సున్నా ఉన్నచో ధనహాని, మూడు సున్నాలు ఉన్నచో ఇబ్బందులు. మొత్తము సరి సంఖ్య వచ్చినచో సమమైన ఫలితము. బేసి సంఖ్య వచ్చినచో ధనలాభము కలుగును.

# ఆదాయ వ్యయములు

| రాశి | ఆదాయము | వ్యయము | రాజపూజ్యం | అవమానం |
|---|---|---|---|---|
| మేషం | 8 | 14 | 4 | 3 |
| వృషభం | 2 | 8 | 7 | 3 |
| మిథునం | 5 | 5 | 3 | 6 |
| కటకం | 14 | 2 | 6 | 6 |
| సింహం | 2 | 14 | 2 | 2 |
| కన్య | 5 | 5 | 5 | 2 |
| తుల | 2 | 8 | 1 | 5 |
| వృశ్చి | 8 | 14 | 4 | 5 |
| ధనస్సు | 11 | 5 | 7 | 5 |
| మకరం | 14 | 14 | 3 | 1 |
| కుంభం | 14 | 14 | 6 | 1 |
| మీనం | 11 | 5 | 2 | 4 |

56=సర్వాదాయం 62=సర్వవ్యయం

# కార్తె ప్రవేశాదుల పట్టిక

| తేదీ | వారం | కార్తె | ఘ. విఘ | నక్షత్రం | రాశి | వాహనం |
|---|---|---|---|---|---|---|
| 13-04-2021 | మంగళ | అశ్వని | 56-29 | పు -పు | పూర్ణజల | ఆఖు |
| 27-04-2021 | మంగళ | భరణి | 37-29 | స్త్రీ -స్త్రీ | పాదజల | మయూర |
| 11-05-2021 | మంగళ | కృత్తిక | 35-38 | పు -స్త్రీ | నిర్జల | గజ |
| 25-05-2021 | మంగళ | రోహిణి | 19-05 | పు -స్త్రీ | నిర్జల | మేష |
| 08-06-2021 | మంగళ | మృగశిర | 17-54 | నపు-పు | నిర్జల | అశ్వ |
| 22-06-2021 | మంగళ | ఆర్ద్ర | 20-11 | స్త్రీ -పు | నిర్జల | మండూక |
| 07-07-2021 | మంగళ | పునర్వసు | 25-19 | పు -పు | పాదజల | మహిషం |
| 20-07-2021 | మంగళ | పుష్యమి | 27-57 | పు-పు | అర్ధజల | ఆఖు |
| 03-08-2021 | మంగళ | ఆశ్రేష | 28-49 | స్త్రీ-పు | అర్ధజల | మయూర |
| 17-08-2021 | మంగళ | మఖ | 25-14 | స్త్రీ-స్త్రీ | అర్ధజల | గజ |
| 31-08-2021 | మంగళ | పుబ్బ | 16-20 | స్త్రీ-నపు | పాదజల | మేష |
| 14-09-2021 | మంగళ | ఉత్తర | 0-53 | స్త్రీ-స్త్రీ | నిర్జల | మహిషం |
| 27-09-2021 | సోమ | హస్త | 38-24 | పు-నపు | అర్ధజల | జంబూక |
| 11-10-2021 | సోమ | చిత్త | 09-06 | స్త్రీ-స్త్రీ | పాదజల | మయూర |
| 24-10-2021 | ఆది | స్వాతి | 33-00 | స్త్రీ-పుం | పాదజల | అశ్వ |
| 06-11-2021 | శని | విశాఖ | 50-25 | స్త్రీ-పుం | నిర్జల | గజ |
| 20-11-2021 | శని | అనూరాధ | 02-32 | పు-పుం | పాదజల | గార్దభ |
| 03-12-2021 | శుక్ర | జ్యేష్ఠ | 09-59 | స్త్రీ-స్త్రీ | పూర్ణజల | మండూక |
| 16-12-2021 | గురు | మూల | 14-06 | పుం-స్త్రీ | అర్ధజల | అశ్వ |
| 29-12-2021 | బుధ | పూ.షా | 16-13 | స్త్రీ-స్త్రీ | పూర్ణజల | గార్దభ |
| 11-01-2021 | మంగళ | ఉ.షా | 17-44 | స్త్రీ-పు | పాదజల | జంబూక |
| 24-01-2021 | సోమ | శ్రవణం | 20-38 | పు-స్త్రీ | నిర్జల | గజ |
| 06-02-2021 | ఆది | ధనిష్ఠ | 16-26 | స్త్రీ-స్త్రీ | అర్ధజల | గార్దభ |
| 19-02-2021 | శని | శతభిషం | 35-51 | నపు-పు | నిర్జల | మండూక |
| 04-03-2021 | శుక్ర | పూ.భా | 50-29 | పు-పు | అర్ధజల | గజ |
| 18-03-2021 | శుక్ర | ఉ.భా | 11-00 | పు-స్త్రీ | అర్ధజల | గార్దభ |
| 31-03-2021 | గురు | రేవతి | 38-03 | స్త్రీ-పుం | పాదజల | జంబూక |

## వర్షధాన్యాదుల పట్టిక

| | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|
| వర్షము | 15 | ధాన్యము | 13 | శీతము | 13 | తృణము | 07 |
| ఉష్ణము | 17 | మారుతము | 13 | ప్రజావృద్ధి | 15 | తన్నాశ: | 15 |
| రాజవిద్వరం | 11 | ఉగ్రం | 05 | పుణ్యం | 05 | పాపము | 05 |
| వ్యాధి | 05 | ఉపశమనం | 05 | ఆచారం | 11 | అనాచారం | 11 |
| జన్మాని | 09 | మరణాని | 09 | దేశోపద్రవం | 13 | దేశస్వాంతన | 05 |
| చోరభయం | 11 | తన్నాశ: | 17 | అగ్నిభయం | 07 | మృగోపద్రవ: | 17 |
| మృగక్షయం | 15 | కీటకభయం | 19 | తన్నాశ: | 13 | మూషకవృద్ధి | 15 |
| తన్నాశ: | 09 | సర్పోపద్రవం | 13 | తన్నాశ: | 11 | కామం | 03 |
| లోభ: | 07 | మోహం | 07 | మదం | 03 | మత్సర: | 13 |
| సుఖం | 03 | దు:ఖం | 07 | భోగ: | 09 | విడంబం | 09 |
| మనోవేదన | 07 | ద్వేష: | 03 | ప్రతిష్ఠ | 15 | అప్రతిష్ఠ | 09 |
| ద్యూతం | 19 | మత్తత | 11 | పురుష ఉత్పత్తి | 19 | స్త్రీ ఉత్పత్తి | 09 |
| ధాతువృద్ధి | 15 | భయం | 03 | శౌర్యం | 07 | దుష్టనిగ్రహం | 11 |
| శిష్టపాలన | 15 | సత్యం | 19 | అసత్యం | 05 | విశ్వాసం | 07 |
| అవిశ్వాసం | 09 | దయ | 11 | నిర్దయ | 13 | న్యాయం | 15 |
| అన్యాయం | 17 | సస్యవృద్ధి | 04 | తన్నాశ: | 08 | పశువృద్ధి | 04 |
| తన్నాశ: | 07 | శుకవృద్ధి | 07 | తన్నాశ: | 05 | దృమకీటవృద్ధి | 08 |
| తన్నాశ: | 08 | క్షుధ | 05 | తృష్ణ | 05 | నిద్ర | 05 |
| ఆలస్యం | 13 | ఉద్యోగం | 13 | శాంతం | 03 | క్రోధం | 03 |
| డంబం | 03 | మిత్రభేదం | 01 | ఇష్టత | 13 | రసనిష్పత్తి | 07 |
| ఫలనిష్పత్తి | 11 | జ్ఞానం | 15 | జ్ఞానం | 15 | కాపట్యం | 03 |
| నిష్కాపట్యం | 13 | ధార్మికం | 17 | అధార్మికం | 01 | గోమాయువృద్ధి | 13 |
| తన్నాశ: | 01 | సస్యకీటవృద్ధి | 07 | తన్నాశ: | 07 | శలభవృద్ధి | 10 |
| తన్నాశ: | 01 | మశకవృద్ధి | 01 | తన్నాశ: | 07 | మత్కుణవృద్ధి | 04 |
| తన్నాశ: | 07 | వృశ్చికవృద్ధి | 10 | తన్నాశ: | 10 | వ్యాఘ్రవృద్ధి | 13 |
| తన్నాశ: | 10 | పక్షివృద్ధి | 04 | తన్నాశ: | 04 | ధేనువృద్ధి | 04 |
| తన్నాశ: | 05 | మహిషవృద్ధి | 05 | తన్నాశ: | 05 | మృగవృద్ధి | 01 |
| తన్నాశ: | 04 | ఛాగవృద్ధి | 04 | తన్నాశ: | 01 | అశ్వవృద్ధి | 03 |

# వర్షధాన్యాదుల పట్టిక

| | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|
| తన్నాశ: | -03 | గజవృద్ధి | -01 | తన్నాశ: | -01 | ఉష్ట్రవృద్ధి | 02 |
| తన్నాశ: | -02 | విప్రవృద్ధి | -03 | తన్నాశ: | -02 | క్షత్రియవృద్ధి | 05 |
| తన్నాశ: | -04 | వైశ్యవృద్ధి | -04 | తన్నాశ: | -01 | శూద్రవృద్ధి | 05 |
| తన్నాశ: | -03 | మ్లేచ్ఛవృద్ధి | -04 | తన్నాశ: | -04 | సంకరవృద్ధి | 03 |
| తన్నాశ: | -01 | నవరత్నవృద్ధి | -03 | తన్నాశ: | -05 | మరకతవృద్ధి | 02 |
| మాణిక్యవృద్ధి | -03 | వజ్రవృద్ధి | -04 | వైఢూర్యవృద్ధి | -05 | గోమేధికవృద్ధి | 01 |
| పుష్యరాగవృద్ధి | -01 | ఇంద్రనీలవృద్ధి | -01 | ప్రవాళవృద్ధి | -01 | మౌక్తికవృద్ధి | 01 |
| ఇతరరత్నవృద్ధి | -01 | సువర్ణవృద్ధి | -10 | రజతవృద్ధి | -08 | తామ్రవృద్ధి | 08 |
| కాంస్యవృద్ధి | -02 | లోహవృద్ధి | -12 | అయవృద్ధి | -08 | త్రపువృద్ధి | 10 |
| సీసవృద్ధి | -10 | రసవృద్ధి | -06 | వ్రీహివృద్ధి | -06 | శాలివృద్ధి | 12 |
| కుళుత్థవృద్ధి | -02 | తిలవృద్ధి | -06 | మాషవృద్ధి | -04 | ముద్గవృద్ధి | 02 |
| సర్షపవృద్ధి | -12 | చణకవృద్ధి | -14 | ఆఢకవృద్ధి | -14 | గోధూమవృద్ధి | 12 |
| కోద్రవవృద్ధి | -04 | ప్రియంగవవృద్ధి | -10 | యావనాళవృద్ధి | -12 | శ్యామాకవృద్ధి | 06 |
| రాజమాషవృద్ధి | -14 | నీవారవృద్ధి | -16 | శింబిధాన్యవృద్ధి | -12 | పనసవృద్ధి | 16 |
| నారికేళవృద్ధి | -16 | మాతులుంగవృద్ధి | -07 | జంబీరవృద్ధి | -16 | ఖర్జూరవృద్ధి | 10 |
| రంభాఫలవృద్ధి | -19 | చూతవృద్ధి | -07 | కపిత్థవృద్ధి | -19 | తింత్రిణీవృద్ధి | 25 |
| ధాత్రీఫలవృద్ధి | -01 | అతివృష్టి | -09 | అనావృష్టి | -15 | మూషికవృద్ధి | 15 |
| శలభవృద్ధి | -13 | శుకవృద్ధి | -09 | స్వచక్రభయం | -03 | పరచక్రభయ: | 17 |
| స్వప్నం | -10 | సుషుప్తి | -08 | జాగ్రత | -08 | పైశున్యం | 02 |
| సంగమం | -12 | గ్నానం | -08 | భుక్తి | -10 | ధాన్యం | 10 |
| అండజ | -15 | స్వేదజ | -13 | ఉద్భిజ | -13 | జరాయుజ | 07 |
| స్థావర | -17 | జంగమ | -13 | విద్యుత్ | -05 | శిలాపాతం | 05 |
| గర్జితం | -03 | ఉత్సాహం | -09 | | | | |

# ప్రత్యబ్ద యోగ పంచక ఫలము

### 1. జ్యేష్ఠ శు॥ప్రతిపద్యుక్త భృగువారఫలమ్

శ్లో॥ ప్రజారోగ్యం సుభిక్షంచ క్షేమం సస్య వివర్ధనమ్।
సువృష్టిస్సర్వదేశానాం జ్యేష్ఠాదౌ భృగువాసరే॥

జ్యేష్ఠ శుద్ధ ప్రతిపద్యుక్త భృగువారము వలన ఆరోగ్యము, సుభిక్షము, క్షేమం, సస్యవృద్ధి, సువృష్టి, కలుగును.

### 2. ఆషాఢ శుక్ల పంచమీ యుక్త సౌమ్యవారఫలమ్

శ్లో॥ ఆషాఢ సిత పంచమ్యాం సౌమ్యవారో యదా భవేత్।
సుభిక్షం దేహమారోగ్యం జాయతేవృద్ధిరుత్తమమ్॥

ఆషాఢ శుద్ధ పంచమి బుధవారమగుటచే సుభిక్షం ఆరోగ్యం వృద్ధి కల్గును.

### 3. ఆషాఢ శుక్ల నవమీ యుక్త స్వాతీ నక్షత్ర ఫలమ్

శ్లో॥ ఆషాఢ శుక్ల పక్షేతు నవమీ స్వాతి సంయుతా।
వాయుస్సర్వత్ర సంవాతి భూమౌబీజం నవాపయేత్॥

ఆషాఢ శుద్ధనవమి స్వాతీ నక్షత్రమగుటచే వాయుచలనం బాగా ఉండును అందుచే బీజములు వేయరాదు.

### 4. ఆషాఢ బ॥ దశమీ యుక్త రోహిణీ ఫలమ్

శ్లో॥ ఆషాఢే కృష్ణపక్షేతు దశమీ రోహిణీ యుతా।
సర్వసస్య సమృద్ధిస్యాత్ సవృష్టిర్జాయతే తథా॥

ఆషాఢ బహుళ దశమి రీహిణీ నక్షత్రమగుటచే సర్వసస్య సమృద్ధి సువృష్టి కల్గును.

### 5. పుష్య బ॥అమావాస్యా ప్రయుక్త భౌమవార ఫలమ్

అమావాస్య మంగళవారముతో కూడినందున భయము కలుగును.

### భరణ్యాది చంద్రమండల ఫలమ్

ధరలు అధికము అగును.

### ఆర్ద్రా ప్రవేశకాల రవి ఫలమ్

జ్యేష్ఠ శు॥ త్రయోదశీ మంగళవారం అనూరాధ నక్షత్రం, సాధ్యయోగం, కౌలవ కరణం నందు మధ్యాహ్నం. ఘ॥20-11విఘ॥లకు కన్యాలగ్నమందు రవి ఆర్ద్రా ప్రవేశము జరిగినది. పగలు ప్రవేశము వలన సస్యనాశము, త్రయోదశి తిథి వలన జలముచే భూమి నిండును, మంగళవారము గావున వర్షముండదు, అనూరాధ నక్షత్రమందు ప్రవేశము వలన నరులకు శుభము, సాధ్యయోగమందు ప్రవేశము వలన సంపూర్ణఫలము, కౌలవ కరణము నందు ప్రవేశము వలన వర్షము కలుగును. కన్యా లగ్నమందు ప్రవేశము వలన శుభము కలుగును.

## మేష సంక్రాంతి ఫలం

చైత్ర శుద్ధ॥ప్రతిపత్ ప్రవేశకాల ద్వితీయ మంగళవారము రాత్రి ఘ॥56-29విఘ లకు మేష సంక్రమణమగుట వలన సువృష్టి కలిగి ధరలధికమగును.

## మకర సంక్రాంతి ఫలం



**శ్లో॥ త్రిశిరం ద్విముఖం చైవ చతుర్వక్త్రం త్రినేత్రకమ్।**
**లమ్బకర్ణం రక్తదన్తం లమ్బభ్రూ దీర్ఘనాశికమ్।**
**అష్టబాహుం ద్విపాదంచ వికృతం కృష్ణవర్ణకమ్।**
**శతయోజనమౌన్నత్యం విస్తీర్ణం ద్వాదశ స్మృతమ్।**
**ఏవం రూపం సవిజ్ఞేయం సంక్రాతేః పురుషస్యతు॥**

నామము:- మిశ్ర నామము

వాహనము:- వ్యాఘ్రము(పులి)

ఈ సంవత్సరము మకర సంక్రమణము పుష్య శుద్ధ॥ద్వాదశీ రోహిణీ నక్షత్రం బ్రహ్మ యోగము బాలవ కరణము సింహ లగ్నమునందు ఘ॥33-17విఘ॥లకు సంక్రమణము జరిగినది.సంక్రాన్తి పురుషుడు **మిశ్ర** నామకుడగుట వలన పశువులకు సుఖమును కలుగజేయును. శంఖోదక స్నానమువలన సుఖ సౌఖ్యములొసంగును. మాషాక్షత ధారణ వలన మినుముల పంట నశించును. రక్త వస్త్ర ధారణ వలన రోగదాయకము, చన్దన గన్ధలేపనము వలన విప్రనాశనము, జాజి పుష్ప ధారణవలన సుశోభనము, ముత్యమును ధరించుటవలన శుభదాయకము రజిత పాత్ర ధారణము వలన సుభిక్షము, పాయస భక్షణ వలన పశునాశనము, కదళీఫల భక్షణము వలన ఫలనాశనము, భిండి ఆయుధ ధారణ వలన ఖ్షుత్‌బాధ రక్త ఛత్ర ధారణ వలన దక్షణ దిక్ గమనము వలన దక్షణ దేశమందు ఖ్షామము, రోహిణీ నక్షత్రమందు అగుటచే విరోధ కరము, శుక్ల పక్షమందు సంక్రమణము వలన జగత్తు హాహాకారములచే దుర్భిక్ష ఖ్షామములు కలిగి యుండును. ద్వాదశీ తిథి సంక్రమణము వలన సుఖము, ఉత్తమము, శుక్రవారమందు మహార్ఘము, ప్రదోషమందు సంక్రమణము వలన పిశాచ నాశనము, సింహ లగ్నము అగుటచే పురుషలకు సంబంధించిన ఆలోచనలు, 17వ ముహూర్తములో సంక్రమణము వలన గుఱ్రములకు కుక్కలకు ఏనుగులకు ఒంటెలకు నాశనము. కర్పూరము అగరు గన్ధము బంగారము ముత్యములతో పొదగబడిన వస్త్రములకు వెలలు అధికమగును.

# కర్తరీ, మౌఢ్య, పుష్కర, గ్రహణ నిర్ణయః

## కర్తరి నిర్ణయము

### లఘుకర్తరి

చైత్ర బ॥ అష్టమి అనగా ది. 04-05-2021 నుండి చైత్ర బ॥ చతుర్దశీలు అనగా ది. 10-05-2021 వరకూ లఘుకర్తరి

### నిజకర్తరి

చైత్రబ॥ అమావాస్య నుండి అనగా ది. 11-05-2021 నుండి వైశాఖ శు॥ విదియ వరకూ అనగా ది.28 05-2021 వరకూ నిజకర్తరి.

## మౌఢ్య నిర్ణయము

### శుక్రమౌఢ్యమి

చైత్రబ॥ పంచమి వరకూ అనగా ది. 1-05-2021 వరకూ శుక్రమౌఢ్యమి, మరలా మార్గశిర బ॥ చతుర్దశీలు అనగా ది. 01-01-2022 నుండి పుష్యవు॥ నవమి వరకూ అనగా ది. 11-01-2022 వరకూ శుక్రమౌఢ్యమి.

### గురుమఢ్యమి

మాఘ బ॥ పంచమి అనగా ది. 21-02-2022 నుండి ఫాల్గుణ బ॥ సప్తమి వరకూ అనగా వి. 24-03-2022 వరకూ గురుమౌఢ్యమి.

## పుష్కర నిర్ణయము

కార్తీక బ॥ విదియ ధనిష్ఠ 3 కుంభే గురుః ఘ.36-37 వి.ఘ. అనగా ది. 21-11-2021 రాత్రి గం.9-04 ని.లకు గురువు కుంభరాశి ప్రవేశము జరుగును. కావున కార్తీ బ॥ తృతీయ నుండి అనగా ది. 22-11-2021 నుండి 03-12-2021 వరకూ సింధూ నదీ పుష్కరములు.

## గ్రహణ నిర్ణయము

ప్లవ నామ సంవత్సరములో తెలంగాణా రాష్ట్రములో కనిపించు గ్రహణములు లేవు.

## మేఘోత్పత్తి నిర్ణయము

నామము:- ఆవర్తన నామకో మేఘః

మేఘోత్పత్తి:- మేరోః శిఖరే మేఘోత్పత్తిః

శ్లో॥ సుమేరోరూర్ధ్వ దిగ్భాగే త్వావర్తాఖ్యః ప్రజాయతే।
సువృష్టి పూర్వ సస్యర్ధి సేంద్రచాపాస్సగర్జితా॥

ఆవర్తనమను మేఘము వలన సువృష్టి, పూర్వసస్య వృద్ధి కలుగును. ఆకాశమందు ఇంద్రధనస్సులు కనిపించును. గర్జించు మేఘములుండును.

## వర్ష ప్రమాణము

శ్లో॥ షష్ఠీయోజన విస్తీర్ణం శతయోజనమున్నతమ్।
ఆఢకస్య ప్రమాణంతు దేవమానేన గణ్యతే॥

విభాగః

శ్లో॥ దశభాగాస్సముద్రేషు పర్వతేషుచ సప్తచ।
ద్వౌభాగౌ భువి పర్జన్య స్త్వేవం వర్షతిచ త్రిధా॥

వర్షం 2 తూములు, వాయువు 3 తూములు, పంట 12 వీసములు.

## పశుపాలకాది నిర్ణయము

పశుపాలకః యమః

స్థానసంరక్షకః యమః

గోష్ఠాద్బహిష్కర్త యమః

పశువులను పాలన, స్థానసంరక్షకత్వం, పశువులను బయటకు పంపు 3 ఆధిపత్యములు యమునికే లభించుట వలన పశునాశము, పాడి అభివృద్ధి లోపించుట మొదలగునవి సంభవించును.

# వర్ష యోగములు

చైత్రము: ఈ మాసమున రవి,కుజ,బుధ,గురు,శుక్ర, శనులవాయు,మహావాయు, దహన, సౌమ్య, అమృత నాడీసంచారము చేతనూ, ఏప్రిల్ 19,20,21, మే 3,4, 5,7,8,9,10,తేదీలలో జలచంద్రయోగము చేతనూ వర్షయోగము గలదు. ఎండలు అధికము అగును.

వైశాఖము: ఈ నెలలో రవి, బుధ, కుజ, గురు, శుక్ర, శనుల వహావాయు, వాయు, దహన, రస, జల, సౌమ్బ నాడీ సంచారము చేతనూ, మే 17,18,19,30,31, జూన్ 1,3,4,5 తేదీలలో జలచంద్రయోగము చేతనూ వర్షసూచనల గలదు. గాడ్పులు వీచును.

జ్యేష్ఠము: ఈ నెలయందు రవి, బుధ, కుజ, గురు, శుక్ర, శనుల దహన, సౌమ్య, రస, జల, అమృత, వాయు సంచారము చేతనూ, జూన్13,14,15,26, 27,28, 30, జులై 1,2,3 తేదీలలో జలచంద్రయోగము చేతనూ వర్షయోగము గలదు.

ఆషాఢము: ఈ మాసమున రవి, బుధ, కుజ, గురు, శుక్ర, శనుల రస, జల, అమృత, సౌమ్య నాడీసంచారము చేతనూ, జులై 10,11,12,23,24,25,28, 29,30, ఆగష్టు7,8 తేదీలలో జలచంద్రయోగము చేతనూ విరివిగా వర్షాలు కురియును.

శ్రావణము: ఈ నెలలో రవి, కుజ, బుధ, గురు, శుక్ర, శనుల అమృత, జల,రస, సౌమ్య, రహన నాడీ సంచారము చేతనూ, ఆగష్టు 9,20,21,22,24,25,26, సెప్టెంబర్ 3,4,5,6 తేదీలలో జలచంద్రయోగము చేతనూ వర్షములు కురిసే అవకాశములున్నవి.

భాద్రపదము: ఈ మాసమున రవి, బుధ, కుజ, గురు, శుక్ర, శనుల జల, రస, సౌమ్య, అమృత,దహన, వాయు, మహావాయు నాడీసంచారము చేతనూ, సెప్టెంబర్ 16,17,18,20,21,22,23,30, అక్టోబర్1,2 తేదీలలో జలచంద్రయోగము చేతనూ వర్షములు కురిసే అవకాశములున్నవి.

ఆశ్వయుజము: ఈ నెలలో రవి, బుధ, కుజ, గురు, శుక్ర, శనుల సౌమ్య, దహన, వాయు, అమృత, రస నాడీ సంచారము చేతనూ, అక్టోబర్14,15,16,18,19, 20,27,27,29 తేదీలలో జలచంద్రయోగము చేతనూ వర్ష సూచనలున్నవి.

కార్తీకము: ఈ మాసమున రవి, బుధ, కుజ, గురు, శుక్ర, శనుల మహావాయు,

వాయు, దహన, అమృత, సౌమ్య నాడీ సంచారము చేతనూ, నవంబర్ 10,11, 12,14,15,16,24,25,26 తేదీలలో జలచంద్రయోగము చేతనూ వర్షయోగములనున్నవి.

మార్గశిరము: ఈనెలో రవి, బుధ, కుజ, గురు, శుక్ర, శనుల వాయు, దహన, సౌమ్య, మహావాయు, రస, అమృత నాడీసంచారము చేతనూ, డిసెంబర్ 7,8,9, 11,12,13,21,22,23 తేదీలలో జలచంద్రయోగము చేతనూ మంచు కురియును. శీతాధిక్యత పెరుగును.

పుష్యము: ఈమాసమందు రవి, బుధ, కుజ, గురు, శుక్ర, శనుల సౌమ్య, రస, అమృత, వాయు, దహన, జలనాడీసంచారము చేతనూ, జనవరి4,5,6,8,9,10, 17,18,19,20,31, ఫిబ్రవరి 1 తేదీలలో జలచంద్రయోగము చేతనూ అతి నిదాఘ శిలాపాతవృష్టి కలుగును.

మాఘము: ఈ మాసమున రవి, బుధ, కుజ, గురు, శుక్ర, శనుల అమృత, జల, సౌమ్య, రస నాడీసంచారము చేతనూ, ఫిబ్రవరి 2,3,4,5,6,7,14,15,16,27, 28, మార్చి 1 తేదీలలో జలచంద్రయోగము చేతనూ వర్షసూచన గలదు.

ఫాల్గుణము: ఈనెలలో రవి, బుధ, కుజ, గురు, శుక్ర, శనుల రస, సౌమ్య, దహన, జల, అమృత నాడీసంచారము చేతనూ, మార్చి 3,4,5,13,14,15,27, 28,29,31, ఏప్రిల్1 తేదీలలో జలచంద్రయోగము చేతనూ వర్ష సూచనలున్నవి. వేడి పెరుగును.



## అర్ఘ విచారణ

చైత్రము: ఈమాసమున ఇనుము, వెండి, బంగారం, మొదలగు లోహములకు ధరలు నిలకడగా యుండి మాసాంతమున ధరలు పెరుగును. వంటగ్యాస్ ధరలు పెరుగును. నూలు వస్త్రములు, పట్టువస్త్రములు, ఫ్యాన్సీవస్తువులు, చర్మాలకు ధరలు మందగించును.

వైశాఖము: ఈమాసము పసుపు, మిర్చి, అట్టం, చెరకు, బెల్లం, పంచదార, నెయ్యి వెలలు అధికమగును. అపరధాన్యములు, చర్మములు, ఉన్నివస్త్రములకు ధరలు పెరుగును. నూలు, చింతపండు, ప్రత్తి, కూరగాయలకు ధరలు అధికమగును.

జ్యేష్ఠము: ఈనెలలో ఇనుము, వెండి, బంగారము మొదలగు లోహములకు ధరలు నిలకడగా యుండి మాసాంతమున ధరలు అధికమగును. వంటగ్యాస్ ధరలు కించెం పెరుగు సూచనలున్నవి. నూలు, వస్త్రములు, పట్టు వస్త్రములు, ఫ్యాన్సీ వస్తువులు, చర్మములకు ధరలు మందగించును.

ఆషాఢము: ఈమాసమందు జీడిగింజలు, కూరగాయలు, సిమెంటు ధరలు అధికమగును. వెండి, బంగారం, ఫ్యాన్సీ వస్తువులకు ధరలు పెరుగును. శనగలు, నెయ్యి, నూనె, చెక్కెర, బెల్లం, చింతపండు మొదలగు వస్తువులకు ధరలు పెరుగును.

శ్రావణము: ఈనెలలో అన్ని వస్తువులకు ధరలు నిలకడగా యుండును. ఆహారధాన్యాలు, కూరగాయలు, వెల్లుల్లి, నూలు వస్త్రములకు కొంచెం ధరలు పెరుగును. వెండి, బంగారం ధరలు నిలకడగా యుండును.

భాద్రపదము: ఈనెలలో పసుపు, చెరకు, బెల్లం, పంచదార, నెయ్యి, మిర్చి, అల్లం ధరలు అధికమగును. నూలు చింతపండు, ప్రత్తి ధరలు పెరుగును. అపరధాన్యములకు, కూరగాయలకు, చర్మములకు, ఉన్ని వస్త్రములకు ధరలు పెరుగును.

ఆశ్వయుజము: ఈ మాసమందు వెండి, బంగారము, దూది, నూలు వస్త్రములు, సట్టు వస్త్రముల ధరలు కొంచెం మందగించును. ఉన్ని వస్త్రములు చర్మాలు అపరములు, ఆహారధాన్యములు, బియ్యం, గోధుమలు, చింతపండు, నెయ్యి, నూనెలు, బెల్లము, పంచదార ధరలు నిలకడగా యుండును.

కార్తీకము: ఈనెలలో వంటగ్యాస్ ధరలు పెరుగు సూచనలున్నవి. నూలు వస్త్రములు పట్టువస్త్రములు, ఫ్యాన్సీ వస్తువులు, చర్మములకు ధరలు మందగించును. ఇనుము, వెండి, బంగారము మొదలగు లోహములకు ధరలు నిలకడగా యుండి మాసాంతమున పెరుగును.

మార్గశిరము: ఈమాసమున మిర్చి, ఆవాలు, మెంతులు, కందిపప్పు, మినుములు, శనగలు, అపరధాన్యములకు ధరలు అధికమగును. ఫ్యాన్సీ వస్తువులు, స్టీలు సామానులకు వెలలు అధికమగును.

పుష్యము: ఈనెలలో ఇనుము, వెండి, బంగారం మొదలగు లోహములకు ధరలు నిలకడగా యుండి మాసాంతమున ధరలు పెరుగును. వంటగ్యాస్ ధరలు పెరుగు సూచనలున్నవి. నూలు వస్త్రములు, పట్టువస్త్రములు, ఫ్యాన్సీ వస్తువులు, చర్మాలకు ధరలు మందగించును.

మాఘము: ఈమాసమున పసుపు, ఇర్చి, అల్లం, చెరకు, బెల్లం, పంచదార, నెయ్యి వెలలు అధికమగును. అపరధాన్యములు, చర్మములు, ఉన్ని వస్త్రములకు ధరలు పెరుగును. నూలు, చింతపండు, ప్రత్తి, కూరగాయలకు ధరలు అధికమగును.

ఫాల్గుణము: ఈ మాసమందు వెండి, బంగారు, దూది, నూలు వస్త్రములు, పట్టు వస్త్రముల ధరలు కొంచెం మందగించును. ఉన్ని వస్త్రములు, చర్మాలు, అపరధాన్యములు, ఆహారధాన్యములు, బియ్యం, గోధుమలు, చింతపండు, నెయ్యి, నూనెలు, బెల్లము, పంచదార ధరలు నిలకడగా యుండును.



# సుముహూర్తములు

## చైత్రమాసము
**ది.13-04-2021 నుండి ది. 14-05-2021 వరకు**

06-05-2021 : బ॥ నవమీ బుధవారం ధనిష్ఠా వృషభే ఉగం.6-54ని.లకు వివాహాదీనాం.

## వైశాఖమాసము
**ది.12-05-2021 నుండి ది. 10-06-2021 వరకు**

13-05-2021 : శు॥విదియా గురువారం రోహిణీ వృషభే ఉగం.6-30 ని.లకు వివాహాదీనాం

20-05-2021 : అష్టమీ గురువారం మఖ వృషభే ఉగం.6-12ని. లకు వివాహాదీనాం

23-05-2021 : ద్వాదశీ ఆదివారం హస్తా వృషభే ఉగం.6-0.నిలకు వివాహాదీనాం

## జ్యేష్ఠమాసము
**ది.11-06-2021 నుండి ది. 09-07-2021 వరకు**

16-06-2021 : శు॥ షష్ఠీ బుధవారం మఖ సింహే ఉగం.11-13 ని.లకు. వివాహాదీనాం

18-06-2021 : అష్టమీ శుక్రవారం ఉత్తర సింహే ఉగం.11-05. నిలకు వివాహాదీనాం

19-06-2021 : నవమీ శనివారం హస్తా సింహే ఉగం.11-01 ని.లకు వివాహాదీనాం

20-06-2021 : దశమీ ఆదివారం చిత్తా సింహే ఉగం.10-57 ని.లకు వివాహాదీనాం

02-07-2021 : బ॥అష్టమీ శుక్రవారం రేవతి సింహే ఉగం.10-10.ని.లకు వివాహాదీనాం, కన్యే ఉగం.11-49.ని.లకు వివాహాదీనాం

## శ్రావణమాసము
## ది.09-08-2021 నుండి ది. 06-09-2021 వరకు

14-08-2021 : శు॥ షష్ఠీ శనివారం స్వాతి కన్యే ఉగం.9-03 ని.లకు వివాహాదీనాం

20-08-2021 : త్రయోదశీ శుక్రవారం ఉత్తరాషాఢా తులా ఉగం.10-27 ని.లకు వివాహాదీనాం

## ఆశ్వయుజమాసము
## ది.07-10-2021 నుండి ది. 04-11-2021 వరకు

16-10-2021 : శు॥ ఏకాదశీ శనివారం శతభిషం ధనుషీ మగం.12-05 ని.లకు వివాహాదీనాం

## కార్తికమాసము
## ది.05-11-2021 నుండి ది. 04-12-2021 వరకు

06-11-2021 : శు॥విదియ శనివారం అనూరాధా ధనుషీ ఉగం. 10-45 ని. లకు వివాహాదీనాం

10-11-2021 : షష్ఠీ బుధవారం ఉత్తరాషాఢా ధనుషీ ఉగం. 10-29 ని.లకు వివాహాదీనాం

12-11-2021 : అష్టమీ శుక్రవారం ధనిష్ఠా ధనుషీ ఉగం.10-21 ని.లకు వివాహాదీనాం

13-11-2021 : నవమీ శనివారం శతభిషా ధనుషీ ఉగం.10-18 ని.లకు వివాహాదీనాం

## మార్గశిరమాసము
## ది.05-12-2021 నుండి ది. 02-01-2022 వరకు

17-12-2021 : చతుర్దశీ శుక్రవారం రోహిణి కుంభే మగం.12-.8 ని.లకు వివాహాదీనాం

19-12-2021 : పూర్ణిమ ఆదివారం మృగశిర కుంభే ఉగం.11-58.ని.లకు వివాహాదీనాం

24-12-2021 : బ॥పంచమీ శుక్రవారం మఖ కుంభే ఉగం.11-36.ని.లకు వివాహాదీనాం

26-12-2021 : సప్తమీ ఆదివారం ఉత్తర కుంభే ఉగం. 11-27.ని.లకు వివాహాదీనాం

## మాఘమాసము
## ది.02-02-2022 నుండి ది. 02-03-2022 వరకు

02-02-2022 : శు॥పాడ్యమి తత్కాల విదియ బుధవారం ధనిష్ఠా మీనే ఉగం. 9-21.ని.లకు వివాహాదీనాం

03-02-2022 : విదియ గురువారం శతభిషా కుంభే ఉగం. 8-30ని.లకు వివాహాదీనాం, మీనే ఉగం. 9-14 ని.లకు, మేషే ఉగం. 11-36. ని.లకు వివాహాదీనాం

05-02-2022 : చవితి తత్కాల పంచమీ శనివారం ఉత్తరాభాద్ర కుంభే ఉగం. 8-20ని.లకు, మీనే ఉగం. 9-14ని.లకు, మేషే ఉగం. 11-26 ని.లకు వివాహాదీనాం

06-02-2022 : పంచమి తత్కాల షష్ఠి ఆదివారం రేవతి మీనే ఉగం. 11-20 ని.లకు వివాహాదీనాం

10-02-2022 : నవమి గురువారం రోహిణి మేషే ఉగం. 11-0 ని.లకు వివాహాదీనాం

11-02-2022 : దశమీ శుక్రవారం మృగశిరా కుంభే ఉగం. 7-49 ని.లకు , మేషే ఉగం. 10-54 ని.లకు వివాహాదీనాం



# రాశిఫలములు

## మేషరాశి

| | |
|---|---|
| చూచేచోలా | అశ్వని 4పాదాలు |
| లీలూలేలో | భరణి 4పాదాలు |
| అ | కృత్తిక 1వ పాదం |



| | | | | | |
|---|---|---|---|---|---|
| ఆదాయం | : | **08** | వ్యయము | : | **14** |
| రాజపూజ్యం | : | **04** | అవమానం | : | **03** |

ఈ రాశి వారికి గురుడు, లాభస్థానమందు, 10వ ఇంట, మరియూ లాభస్థానమందు ఉండుటచే సకలవిధాలా శుభకరముగా ఉండును. శని, దశమ స్థానమందు, రాహు కేతువులు లోహమూర్తులుగా సంచరింతురు.

గురుని వలన ధనలాభమును, సుఖము, దేహ పుష్టి, యశస్సు, ధనలాభము, శత్రు నాశం, కార్యజయము, కలుగును. ఉద్యోగులకు పదవి యందు ఉన్నతి కలుగును. రాజకీయ రంగము వారికి లాభదాయక కాలము. శని వలన స్థానభ్రంశము, భయము, కార్యములందు అపజయము, దుఃఖము, కృషి మెండుగ చేయవలసి వచ్చుట, కలుగును. రాహువు వలన కలహములను ధన నాశము, సాంసారికదు:ఖము, వాగ్వివాదములు కల్గును. కేతువు వలన రోగపీడలు, శరీరదౌర్బల్యం, కల్గును. ఈ రాశి వారికి ఈ వత్సరమున గురుబలము మెండుగా ఉండుటచే, విద్యార్థులకు పరీక్షలలో ఉన్నత శ్రేణి ప్రాప్తి, తెలివి తేటలు పెరుగుట, కల్గును. అవివాహితులకు కళ్యాణ ప్రాప్తి కలుగ గలదు. రాజకీయ నాయకులకుసైతం పదవీ ఉన్నతి గోచరించుచున్నది. వ్యవసాయము,పాడి పరిశ్రమ కూడా ఫలించును. క్రీడా కారలు, చలనచిత్ర రంగము వారు సన్మానములు పొందుటఅధిక ధన సముపార్జన చేయుట గోచరించుచున్నది.

ఈ రాశి వారు పరమేశ్వరుని ఆరాధించుటచే మరియూ వీలయునపుడు నువ్వులు దానము చేయుటచే మిక్కిలి శుభ ఫలితములు పొంది ఈ సంవత్సరము సుఖమయముగా గడుపగలరు.

# వృషభరాశి

| | |
|---|---|
| ఇ ఉ ఎ | కృత్తిక 2,3,4 పాదాలు |
| ఒ,వా,వి,వు | రోహిణి 4పాదాలు |
| వేవో | మృగశిర 1,2 పాదాలు |



| | | | |
|---|---|---|---|
| ఆదాయం | : **02** | వ్యయము | : **08** |
| రాజపూజ్యం | : **07** | అవమానం | : **03** |

ఈ రాశి వారికి గురుడు 10 వ స్థానమందు, శని 9 వ స్థానమందు, రాహు, కేతువులు 1వ స్థానమున 7వ స్థానమున సంచరింతురు.

గురుని వలన కార్యలాభము, సంతాన విషయక లాభమును, ఆర్థిక నష్టము కలుగు సూచనలు కలవు. సంవత్సర మధ్యము నుండి ధనలాభము, సకల కార్య జయము, సుఖము, ఆర్థిక వృద్ధి, ధర్మము పట్ల ఆసక్తి, భూ లాభము, మృష్టాన్న భోజనము, స్త్రీ సౌఖ్యము కలుగును. శని భాగ్యస్థాన సంచారముచే దేహ కష్టము, ధన నష్టము, చిన్నవారిచే అవమానము కల్గును. రాహువు 1వ స్థాన సంచారము వలన మానసిక కలవరము, అనారోగ్యము కల్గును. కేతువు 7వ ఇంట ఉండుటచే సాంసరిక సౌఖ్యము లేకుండుట కల్గును. ఈ సంవత్సరమున గురువు మాత్రమే అనుకూలిస్తూ శని, రాహు, కేతువులు అనుకూలించక పోవుటచే విద్యార్థులకు విద్యయందు, పరీక్షలయందు ఉత్తమశ్రేణి లభించు సూచనలు గలవు. ఉత్తమ ఉపాధ్యాయులకు సన్మానములు లభించగలవు. స్థానచలనము, గోచరించుచున్నవి. వ్యవసాయరంగము వారికి, పాడి పరిశ్రమ వారికి, చేతివృత్తుల వారికి మధ్యమ ఫలితములు గోచరించుచున్నవి. రాజకీయ రంగము వారికి కూడానూ మధ్యమముగానే ఉండును. యాత్రలు చేయు సమయమున జాగ్రత్త అవసరము. ఆరోగ్య విషయములో జాగ్రత్త అవసరము. స్థానభ్రంశము, తగాదలు సంభవించు అవకాశము కలదు.

గ్రహ శాన్తికై శనివారము నాడు రుద్రాభిషేకము చేయించవలయును. రాహుకేతు దోష నివారణకై సుబ్రహ్మణ్య ఆరాధన, దుర్గా ఆరాధన, మినుములను, ఉలవలను దానమివ్వ వలయును.

# మిథునరాశి

| | |
|---|---|
| కా కి | మృగశిర 3,4 పాదాలు |
| కు ఖం ఙ్ఞ ఛ | ఆర్ద్ర 4పాదాలు |
| కే కో హా | పునర్వసు 1,2,3పాదాలు |



| | | | | | |
|---|---|---|---|---|---|
| ఆదాయం | : | **05** | వ్యయము | : | **05** |
| రాజపూజ్యం | : | **03** | అవమానం | : | **06** |

ఈ రాశి వారికి గురుడు 9,10,11 స్థానములయందు, శని 8 స్థానమందు, రాహు, కేతువులు 12, 6 స్థానములయందు సంచరించుచున్నారు.

గురువు వలన ధనప్రాప్తి, కార్యజయము, సంపాదన, స్వ ధర్మానుష్ఠానము, భూలాభము, మృష్టాన్నము, భార్య అనుకూలవతిగా యుండును. శని అష్టమరాశి సంచారముచే స్థాన చలనము, అనారోగ్యము, అపమృత్యు భయము, కలుగసూచనలున్నవి కాబట్టి దోష నివారణకు రుద్రాభిషేకము ఉపశమనమునిచ్చును. రాహువు వలన ధననష్టం, అనారోగ్యము, దెబ్బలు, కేతువు వలన సుఖము, శత్రు జయము కలుగును.

విద్యార్థులు ఉన్నత ర్యాంకులు సాధించగలరు. ఉపాధ్యాయులకు స్థానచలనము తోచుచున్నది. వ్యవసాయదారులకు పంటలు కలసివచ్చును. వ్యాపారస్తులకు మామూలుగా ఉన్నది. పాడి పరిశ్రమ, చేతివృత్తి, కూలివారలు, న్యాయవాదులు, వైద్యులు, చలనచిత్రమువార్లకు, గాయకులకు, సగము ఫలితమే వచ్చు సూచనలు ఉన్నవి. రాజకీయరంగము వారికి మామూలు కాలము. శనగలను దానమిచ్చుటచే దోషోపశమనం కాగలదు. ఈశ్వర ఆరాధన ఉత్తమ ఫలితములను ఇస్తుంది. శనికి తైలాభిషేకము చేయించుట వలన మిక్కిలి శుభము చేకూరును. మినుములను దానమిచ్చుటచే శాన్తి చేకూరును.

సంవత్సర మధ్యయందు లలితా సహస్రనామ పారాయణ, దుర్గా ఆరాధన చేయుటచే మిక్కిలి శుభ ఫలితములు వచ్చి సుఖజీవితము సాగించగలరు.

# కర్కాటక రాశి

| | |
|---|---|
| హి | పునర్వసు 4వపాదము |
| హు,హే,హో,డ | పుష్యమి 4 పాదాలు |
| డి డు డె డో | ఆశ్లేష 4పాదాలు |



| | | | | | |
|---|---|---|---|---|---|
| ఆదాయం | : | **14** | వ్యయము | : | **02** |
| రాజపూజ్యం | : | **06** | అవమానం | : | **06** |

ఈ రాశి వారికి గురుడు 7,8 స్థానములందు, శని 7వ స్థానమందు, రాహు, కేతువులు 11వ, 5వ స్థానములందు సంచరించుచున్నారు.

గురుని వలన ధననష్టము, స్థానచలనమును, అనారోగ్యము కల్గును. శని సప్తమరాశి సంచారముచే విదేశీ ప్రయాణములు, ఇతర ప్రాంతములకు ప్రయాణము చేయుట, హృదయ రోగములు, దాంపత్య సుఖము లేకుండుట కల్గును. రాహువు వలన చిన్న పనుల వలన ధనలాభము, ధైర్యమును కలిగించును. శుభము, ధాన్య లాభము, వాహన లాభములు కలుగుటయూ, మృష్టాన్నభోజనము వస్త్ర పుష్ప లాభములు కలుగును. కేతువు వలన ధన వ్యయము, బుద్ధివికాసము లేకుండుట, కలుగును.

విద్యార్థుకు మిశ్రమ ఫలితములు, ఉపాధ్యాయులకు స్థానచలనములు, అధికారుల వలన భయము. వ్యాపారస్తులకు న్యాయవాదులకు, వైద్యులకు, పాడిపరిశ్రమ వారికి వ్యవసాయదారులకు, వృత్తిపనివారలకు, చలన చిత్రములవారికి, గాయకులకు, క్రీడారంగము వారికి, యంత్ర పరిశ్రమల వారికి, లాభము కలుగుచున్నది. ఈ రాశి వారు ఆరోగ్య విషయములో తగిన శ్రద్ధ చూప వలయును. వ్యవసాయదారులకు సగము లాభమే ఉండును. రుద్రాభిషేకము చేయించి శనగలు దానము ఇచ్చుటచే కొంత శాన్తి చేకూరగలదు.

శని గ్రహశాన్తి కొరకై శని వారము శివారాధన చేయుచు శని వారము ఉపవాసము చేయుచూ శివ నామ స్మరణ చేయుటచే శాన్తి చేకూరి సుఖము కల్గును.

# సింహ రాశి

మ,మి,ము,మేమఖ 4పాదాలు
మో ట టి టు పుబ్బ 4 పాదాలు
టె ఉత్తర 1వ పాదము



| | | | | | |
|---|---|---|---|---|---|
| ఆదాయం | : | **02** | వ్యయము | : | **14** |
| రాజపూజ్యం | : | **02** | అవమానం | : | **02** |

ఈ రాశి వారికి గురుడు 6,7 స్థానములందు మరియూ శని 6వ స్థానమునందు రాహు, కేతువులు 10,4 స్థానములలో సంచరింతురు.

గురుని వలన దేహ సుఖము, సాంసారిక సుఖము కల్గును. గౌరవం, కార్యసిద్ధి, ఉన్నత స్థాన ప్రాప్తి కల్గును, అయితే ఈ ఫలితము సంవత్సర మధ్యమము వరకే ఉండును. ఆ తరువాత వాటికి వ్యతిరేక ఫలితములు కల్గును. శనిసంచారము వలన క్రింద వారి వలన ధన లాభము, శత్రు క్షయము కల్గును. తన పనివారలు బాగుగ మాట వినుట, సుఖం, ధనధాన్యములు వృద్ధి పొందుట, బంధువులకు సంతోషము కలిగించుట, భూ లాభము సిద్ధించును. రాహువు వృషభరాశి సంచారము వలన వాగ్వివాదములు, కార్య నాశనమును, అవమానములు, కల్గును. కేతువు వృశ్చిక రాశి సంచారముచే, శాన్తి, తల్లివలన బాధపొందుట, క్లేశములను కలిగించును. విద్యార్థులు ఉత్తీర్ణతలను పొందుదురు. వ్యాపారస్తులు లాభములు గడింతురు. వ్యవసాయదారులకు మధ్యమముగా కలదు. పాడిపంట, రాజకీయనాయకులకు, గాయకులకు, చిత్రపరిశ్రమ వారికి, ఈ సంవత్సర చివర కాలము యోగదాయకముగా వుండును. అన్ని రంగముల వారికి లాభదాయకముగా వుండును. వైద్యులు, న్యాయవాదులు మంచి గౌరవమును, ధనలాభమును పొందుదురు. శివాభిషేకముచే శాన్తి చేకూరగలదు. శనగలను దానమిచ్చుటచే శాన్తి చేకూరును. లలితా సహస్రనామపారాయణ కుంకుమార్చన వలన శుభము కల్గును. మినుములను దానమొనర్చుట. శుభదాయకము. సుబ్రహ్మణ్య ఆరాధన శుభములను చేకూర్చును.

# కన్యా రాశి

| | | |
|---|---|---|
| టో పా పి | ఉత్తర | 2,3,4 పాదాలు |
| పు షం ణ ఠ | హస్త | 4 పాదాలు |
| పే పో | చిత్త | 1,2 పాదాలు |



| | | | | | |
|---|---|---|---|---|---|
| ఆదాయం | : | **05** | వ్యయము | : | **05** |
| రాజపూజ్యం | : | **05** | అవమానం | : | **02** |

ఈ రాశి వారికి గురుడు 5,6 స్థానములందు సంచరించును. శని 5వ స్థానమందు రాహు, కేతువులు 9వ, 3వ స్థానములందు సంచరింతురు.

గురుని వలన బాధలు కష్టములు తొలగి దేహ ఆరోగ్యము కలుగును. సంపద, పుత్రమూలక సుఖం, లాభము, సుఖము, ఇష్టద్రవ్యప్రాప్తి, ఐశ్వర్యము, తలచిన పనులు నెరవేరుట, సంతోషము, తన బంధువుల వలన సంతోషము కలుగును. శని వలన నష్టము జరుగదు. రాహువు వలన ధనలాభం, ఆనందం కలుగుతుంది.

విద్యార్థులకు కృషి అవసరము. పై అదికారుల వలన కష్టము కల్గు సూచనలు కలవు. వ్యవసాయదారులకు సగము లాభమే కల్గును. వ్యాపారస్తులకు నష్టము కల్గును. పాడి, యంత్ర పరిశ్రమల వారికి, న్యాయవాదులు, వైద్యులు, చిత్ర పరిశ్రమ వారికి, గాయకులకు, క్రీడాకారులకు సామాన్య ఫలితములుండును. ఈ రాశి వారికి సంవత్సర మధ్యకాలములో కొంత అనుకూలముగా వుండును. శివాభిషేకము చేయించి శనగలను దక్షిణతో దానమిచ్చుటచే శాన్తి చేకూరును. అర్ధనారీశ్వర స్తోత్రము పఠించుటచే మిక్కిలి శుభములు కల్గును. శివపార్వతుల కళ్యాణము చేయించుటచే ఈ సంవత్సరము బాగుగా ఉండును. శని ప్రీతికై నువ్వుల దానము చేయుట శ్రేయోదాయకము.

# తులా రాశి

| | |
|---|---|
| రా రి | చిత్త 3,4 పాదాలు |
| రు రే రో త | స్వాతి 4 పాదాలు |
| తి తు తే | విశాఖ 1,2,3పాదాలు. |



| | | | | | |
|---|---|---|---|---|---|
| ఆదాయం | : | **02** | వ్యయము | : | **08** |
| రాజపూజ్యం | : | **01** | అవమానం | : | **05** |

ఈ రాశి వారికి గురుడు 4,5 స్థానములందు, శని 4వ స్థానమందు, రాహు, కేతువులు 8వ, 2వ స్థానములందు సంచరింతురు.

గురుని వలన ధన లాభము, కళత్ర సుఖం, సాంసారిక సౌఖ్యము, మానసిక ప్రశాంతత, సంపద, లాభము, సుఖం, సంతోషం, సంపదలాభము, ఐశ్వర్యము కీర్తి, సంతోషము, ఉద్యోగ ఉన్నతులు, సంతానం వృద్ధిలోనికి వచ్చుట, తన బంధువు వలన సంతోషము కలుగును. శని 4వ స్థాన సంచారముచే అనారోగ్యము, తల్లి వలన, భూమి వలన గృహము వలన ధనము ఖర్చు అగును. స్థానచలన సూచనలు ఉన్నవి. కుటుంబమూలక ధనవ్యయము, వాగ్వివాదములు, వ్యాధులు, కల్గును. ఈ సంవత్సరము ధన సంబంధముగా మంచి ఫలితములు కల్గును. మానసికంగా దేహ ఆరోగ్యము పరంగా మిక్కిలి చెడు ఫలితములు సంభవించును. విద్యార్థులు నామమాత్రముగా ఉత్తీర్ణతను సాధించెదరు. వ్యవసాయదారులకు సామాన్యముగ వుండును. వ్యాపారస్తులు నష్టములను చవిచూడవలసి వచ్చును. పాడి, మత్స్య, యంత్ర పరిశ్రమల వారికి ఫలితములు సామాన్యములు. వైద్యులు, చిత్ర పరిశ్రమ, గాయకులకు, క్రీడాకారులకు సామాన్య ఫలితములు కల్గును. గుర్తింపు లభింపదు. శివాభిషేకము చేయించి శనగలను తగిన దక్షిణతో దానమిచ్చుటచే కొంత శాన్తి చేకూరును. ఈశ్వర స్తోత్రములను పఠించుట సూచించతగిన విషయం. తైలాభిషేకము నువ్వుల దానము, నల్ల వస్త్రముల దానము, గుమ్మడికాయదానము మొదలగునవి శాస్త్రమునందు సూచించెను. రుద్రార్చన శాన్తిని చేకూర్చును.

# వృశ్చిక రాశి

| | |
|---|---|
| తో | విశాఖ 4వ పాదము |
| నా నీ నూ నే | అనూరాధ 4 పాదాలు |
| నో,యా,యి,యు | జ్యేష్ఠ 4పాదాలు |



| | | | | | |
|---|---|---|---|---|---|
| ఆదాయం | : | 08 | వ్యయము | : | 14 |
| రాజపూజ్యం | : | 04 | అవమానం | : | 05 |

ఈ రాశి వారికి గురుడు 3,4 స్థానములందును, శని 3వ స్థానమందు రాహు, కేతువులు 7వ, 1వ స్థానములలో సంచరింతురు. ఈ రాశివారికి గురుడు సంవత్సర ప్రారంభములోను సంవత్సరాంతములోన ధనవ్యయము, అనారోగ్యము, మాతృమూలక క్లేశములు భూ, గృహ మూలక ధనవ్యయము కలుగ చేయును. సోదర, సోదరీల వలన బాధ కల్గును. శని వలన సంపదలు, రాహువు వలన మానసిక ఆందోళనలు, భయం, సాంసారిక దుఃఖం, కేతువు వలన అనారోగ్యం, స్థానభ్రంశం కలుగును.

విద్యార్థులు సామాన్య ఉత్తీర్ణతను సాధింతురు. వ్యవసాయదారులకు సామాన్యము. పాడి, మత్స్య, యంత్ర పరిశ్రమలు, వారికి ఫలితములు సామాన్యములు. న్యాయవాదులు, వైద్యులు, చిత్ర పరిశ్రమ వారు, గాయకులకు, క్రీడాకారులకు సామాన్యము. ఎంతో ఫలించిన గాని గుర్తింపు లభింపదు. గురువారము నాడు రుద్రాభిషేకము చేయించి జయజయశంకర హరహర శంకర అను నామ స్మరణ చేయుట సూచనీయం. గురువారమునాడు శనగలను దానమివ్వవలయును. శివపార్వతుల దర్శనం, కళ్యాణం లో పాల్గొనుట శుభమును చేకూర్చును. కుంకుమార్చన లలితా సహస్రనామ పారాయణ శుభమును ఇచ్చును. మంగళ వారము సుబ్రహ్మణ్య ఆరాధన చేయుటచే రాహు కేతు దోషశాన్తి కల్గును.

# ధనస్సు రాశి

| | |
|---|---|
| యే యో బ బి | మూల 4 పాదాలు |
| బు ధా భ ఢ | పూర్వాషాఢా 4 పాదాలు |
| బే | ఉత్తరాషాఢా 1వ పాదం |



| | | | | |
|---|---|---|---|---|
| ఆదాయం | : 11 | | వ్యయము | : 05 |
| రాజపూజ్యం | : 07 | | అవమానం | : 05 |

ఈ రాశి వారికి గురుడు 2.3 స్థానములందు, మరియూ శని 2వ స్థానమందు, రాహు, కేతువులు ఈ సంవత్సరమంతా 6వ, 12వ స్థానములందు సంచరింతురు.

పూర్వ స్మృతులు గుర్తుకు వచ్చుట, మనో ప్రశాంతత లేకుండుట కల్గును. గురువు వలన వాక్కు వలన నెగ్గుట, వ్యక్తిత్వం, బుద్ధిశక్తి కల్గును. సాంకేతికతయందు దృష్టి సాంకేతిక బుద్ధి కల్గును. గురుని వలన ఆపదలు కనిష్ఠ సోదర మూలక కష్టములు, ధన లాభము, కుటుంబ సౌఖ్యము, లాభము, సుఖము, ధనము, కీర్తి, హృదయ సౌఖ్యము, కీర్తి, సుఖము. ధనాదాయము ధార్మిక కార్యములు చేయుట వలన సంతోషము కల్గును. శనిచే ఆపదలను, కుటుంబ మూలక ఖర్చులను వాగ్వివాదములను కలిగించును. హాని, వ్యాధి, వైరం, ఎల్లప్పుడూ కష్టము, అకారణ విరోధము, కార్యనష్టం స్వ బన్ధు విరోధము, కల్గును.రాహువు వలన సుఖమును, ధనలాభమును, పరాక్రమములను, భోగము, కల్గును. పరులు సైతము మంచి చేయును. కేతువు వలన భయము, కార్య నాశనము, స్థానభ్రంశము, ధన నష్టము,

కార్యములందు ఆటంకము, ప్రయాణములు అదికముగా సంభవించుట కల్గును.

విద్యార్థులు సామాన్య ఫలితము గడింతురు. వ్యాపారస్తులకు సామాన్య లాభములు కలుగును. వ్యవసాయ దారులకు మిక్కిలి శుభము. కృషి చేయు వారికి లాభముగా యుండును.

శని శాన్తికై రుద్రాభిషేకము చేసుకొనుట శ్రేయోదాయకము.

# మకర రాశి

| | | |
|---|---|---|
| బో జా జి | ఉ॥షా | 2,3,4 పాదాలు |
| జు జే జో ఖా | శ్రవణం | 4 పాదాలు |
| గా గి | ధనిష్ఠ | 1,2 పాదాలు |



| | | | |
|---|---|---|---|
| ఆదాయం | : **14** | వ్యయము | : **14** |
| రాజపూజ్యం | : **03** | అవమానం | : **01** |

ఈ రాశి వారికి గురుడు 1,2 స్థానములలో, శని 1వస్థానమందు, రాహు, కేతువులు 5వ, 11వ స్థానములలో సంచరింతురు.

గురుని వలన దేహారోగ్యము బాగుండకుండుట, నరముల బలహీనత, ఉదర సంబంధ, రోగములు, స్థాన భ్రంశము, గుడులుగోపురములకు ప్రయాణములు, కుటుంబముయందు సుఖము, ధనప్రాప్తి, కీర్తి, ధర్మకార్యముల పట్ల మక్కువ గోచరమగుచున్నవి. శని వలన స్థానచలనము, అనారోగ్యం, భయం, కష్టము, అపమృత్యుభయము, మంచిఆలోచనలు రాకుండుట, రోగములు, దుఃఖములు కలుగు సూచనలు ఉన్నవి. రాహువు వలన పుత్రుని వలన అసౌఖ్యము, ధన నష్టము, నాశం, పుత్రనితో విరోధము, భోజనసౌఖ్యము లేకుండుట, అయిననూ అందరిచే పూజ్యభావము కల్గును. కేతువు వలన సౌఖ్యము, ధన లాభం, మృష్టాన్న భోజనము, అలంకార వస్తు లాభము కల్గును.

విద్యార్థులకు ఉత్తమ శ్రేణి, కళ్యాణ యోగము, వ్యాపారస్తులకు సామాన్య కాలము, కొంత ధన నష్టము, వైద్యులకు, న్యాయవాదులకు, కళాకారులకు, వ్యావసాయదారులకు, మత్స్య, పాడి పరిశ్రమల వారికి, రాజకీయ నాయకులకు సామాన్య ఫలితములు అగుపించుచున్నవి. ఏల్నాటి శని దోషము కలదు కావున, రుద్రాభిషేకము, రుద్రునకు తైలాభిషేకము, తిలదానము, గుమ్మడికాయ దానము, మున్నగునవి అచరించుట శ్రేయోదాయకము. గురు దోష నివారణకై శనగలదానము గురువారమునాడు ఆచరించుట శుభఫల దాయకము.

# కుంభ రాశి

| | |
|---|---|
| గు గే | ధనిష్ఠ 3,4 పాదాలు |
| గో సా సి సు | శతభిషం 4 పాదాలు |
| సె సో దా | పూ॥భా 1,2,3 పాదాలు |



| | | | | | |
|---|---|---|---|---|---|
| ఆదాయం | : | **14** | వ్యయము | : | **14** |
| రాజపూజ్యం | : | **06** | అవమానం | : | **01** |

ఈ రాశి వారికి గురుడు 1,12 స్థానములలోనూ, శని 12వ స్థానమందు, రాహు, కేతువులు 4, 10 స్థానములందు సంచరింతురు.

గురుని వలన స్థాన చలనము, మనో ప్రశాంతత లేకుండుట, దేహమునందు నిస్సత్తువ, వాక్ ఫలించకుండుట, వాగ్వివాదములు, ఇంటియందు శుభ పరంపర కల్గును. శని వలన ఇతరులచే కష్టములేర్పడుట, అనారోగ్యము, స్థానచలనం, ధననష్టము కల్గును. రాహువు వలన అనారోగ్యం, చర్మ వ్యాధులు, గాయములు, అసౌఖ్యం, ప్రయాణములలో కష్టములు కల్గు సూచనలు కలవు. కేతువు వలన కలహములు, కార్యహాని కల్గును.

విద్యార్థులకు సామాన్య ఫలములు కల్గును. స్థానచలనం కల్గును, వ్యాపారస్థులకు, వ్యవసాయదారులకు, సామాన్యము కల్గును. పాడి, మత్స్య, చలనచిత్ర రంగము వారికి, నాట్య రంగమువారికి, గాయకులకు, న్యాయవాదులకు, వైద్యులకు, ఇతర వృత్తిపని వారలకు, రాజకీయ నాయకులకు సామాన్యముగా నుండును. కావున ఈ సంవత్సరము కొంత సామాన్య ఫలితములే కనపడుచున్నవి. ఈ రాశివారికి వృత్తి వ్యాపారములలో జాగ్రత్త అవసరము. గురువారమునాడు ఈశ్వరారాధన అభిషేకము, శనగలు దానము ఆచరించుట శ్రేయోదాయకము, లలితా సహస్రనామపారాయణ కుంకుమ పూజ వలన సకల శ్రేయస్సులు కల్గును.

# మీన రాశి

| | | |
|---|---|---|
| ది | పూ॥భా 4వ పాదము | |
| దు శ ఝ థ | ఉ॥భా 4 పాదాలు | |
| దే దో చ చి | రేవతి 4 పాదాలు | |



| | | | | | |
|---|---|---|---|---|---|
| ఆదాయం | : | **11** | వ్యయము | : | **05** |
| రాజపూజ్యం | : | **02** | అవమానం | : | **04** |

ఈ రాశి వారికి గురుడు 11, 12, 1 స్థానములందు, శని 11వ స్థానమందు, రాహు, కేతువులు 3వ, 9వ స్థానములందు సంచరింతురు.

గురుని వలన ధన వ్యయము, స్థాన చలనము, అనారోగ్యము, సూచితము. అయిననూ గురుడు సంతోషము, ధన లాభము, కార్యసిద్ధి కలుగును. శని వలన ధనలాభమును అభివృద్ధిని కల్గును. రాహువు వలన సుఖము, సోదరులతో తగాదులు, కల్గును. శౌర్య ఔదార్య నాయకత్వ లక్షణములు బయటపడి కార్యములందు జయము కల్గును. కేతువు వలన సకల సౌభాగ్యములు, విద్య సూచింపబడుతున్నవి.

విద్యార్థులకు ఉత్తమ ఫలితములే కల్గును. వ్యవసాయదారులకు, వ్యాపారస్తులకు, ఉత్తమ ఫలితములు లాభములు కల్గును. న్యాయవాదులకు, వైద్యులకు, ఉత్తమ కాలము కావున సర్వత్ర విజయము కల్గును. మత్స్య, పాడి, చిత్ర, నాట్య, గాయకులకు, కళాకారులు సన్మానములు అగుపడుచున్నవి. ఎంతోకాలమునుంచి వేచి చూస్తున్న పనులు అగును. రాజకీయ నాయకులకు ఉత్తమ పదవులు కల్గును. కృషి రంగములలో కలవారికి ధనము బాగుగా లభించును. మంచి మన్నన కల్గును.

శని వార మరియూ గురు వారములందు ఈశ్వరారాధన, లలితాంబిక ఆరాధన వలన మిక్కిలి శుభ ఫలితములు కల్గుతూ ఈ సంవత్సరము శుభప్రదముగా ఉండును.

# నక్షత్ర నిర్ణయము సందిగ్ధముగా గల పేర్ల నక్షత్ర వివరణ

శ్లో॥ ద్వన్ద్వాక్షరంతు యత్రోక్తం ప్రథమాక్షర వర్జితమ్।
ద్వన్ద్వనామ ఇతి ప్రోక్తం ద్వితీయం నామ సంగ్రహమ్॥

శ్లో॥ వర్ణే స్వరంచైత్వమౌత్వం యత్రాదౌ వర్తతే సదా।
తత్ర పూర్వాక్షరం గ్రాహ్యం ఇత్యుక్తం బ్రహ్మయామిళే॥

| | | |
|---|---|---|
| శ్రీనివాస్, శ్రీకరి, శ్రీకాంత్, శ్రీధర్ | చిత్త 4 పాదం | తులారాశి |
| ద్రౌపతి, ద్రోణ | స్వాతి 3 పాదం | తులారాశి |
| సృజన్, హృషీకేశ్ | స్వాతి 1 పాదం | తుల |
| స్నుషిక, స్నేహ | అనూరాధ-3 | వృశ్చికం |
| కృష్ణ, కృప, క్రాంతి, | మృగశిర-3 | మిథునం |
| కీర్తి, కీర్తిప్రద్ | మృగశిర-4 | మిథునం |
| జ్ఞానానంద, జ్ఞానేశ్వరి | ఆర్ద్ర 3 పాదం | మిథునం |
| కౌసల్య, కైక, కైంకరి, కైలాష్ | పునర్వసు-1 | మిథునం |
| మృగేన్ద్ర, మృణాళిని, ఫణి, స్పందన, పౌరోహిత | ఉత్తర 3 పాదం | కన్య |
| క్షేమకరి, క్షేత్రపాల్ | హస్త 2 పాదం | కన్య |
| ప్రభాకర్, బ్రహ్మానందం, భ్రమరామ్బ | చిత్త 3 పాదం | తుల |
| ప్రహ్లాద్, హ్లాదని, క్లేష, లౌకిక | అశ్విని 4 పాదం | మేషం |
| ఐశ్వర్య, ఐంద్ర | కృత్తిక 1పాదం | మేషం |
| తృణిక, ఋష్యశృంగ | కృత్తిక 3 పాదం | వృషభం |
| వృష, స్వప్న, స్వాతి | రోహిణి 2 పాదం | వృషభం |
| శ్వేత, వైకుంఠ | మృగశిర-1 | వృషభం |
| మౌనిక | పుబ్బ 1 పాదం | సింహం |
| ప్రణీత, ప్రవీణ్, శ్రావణి, స్రవంతి | చిత్త 3 పాదం | తులారాశి |
| సౌందర్య | పూర్వాభాద్ర 2 | కుంభం |
| దైవఙ్ఞ, ద్యుతి | పూర్వాభాద్ర 3 | కుంభం |
| శాంకరి, శౌనక, శోభ, శైలజ, శృతి, శివ, శంకర్ | ఉత్తరాభాద్ర 2 | మీనం |
| చైతన్య, చౌడేశ్వరి | రేవతి 3 పాదం | మీనం |
| శ్యామల, చ్యవన, చ్యుతి, జ్యోతి | మూల 2 పాదం | ధనస్సు |
| భీముడు | మూల 4పాదం | ధనస్సు |
| భారతి, భైరవ, భావన్ | పూర్వాషాఢ 3 | ధనస్సు |
| ధూర్జటి, ధ్యాన్, ధృవ | పూర్వాషాఢ 2 | ధనస్సు |
| ఋషి | శ్రవణం-4 | మకరం |
| గౌతమి, గౌరి | శతభిష 1పాదం | కుంభం |

| లగ్న ప్రమాణము | | | లగ్న పుష్కరాంశ | | |
|---|---|---|---|---|---|
| **రాశి** | **ఘ-విఘ** | **గం-ని** | **రాశి** | **ఘ-విఘ** | **గం-ని** |
| మేషం | 4-02 | 1-37 | మేషం | 2-41 | 1-04 |
| వృషభం | 4-30 | 1-48 | వృషభం | 1-57 | 0-47 |
| మిథునం | 5-11 | 2-05 | మిథునం | 3-58 | 1-36 |
| కర్కాటకం | 5-35 | 2-14 | కర్కాటకం | 1-18 | 0-27 |
| సింహం | 5-28 | 2-12 | సింహం | 3-38 | 1-27 |
| కన్య | 5-14 | 2-06 | కన్య | 2-16 | 0-54 |
| తుల | 5-14 | 2-06 | తుల | 4-01 | 1-36 |
| వృశ్చికం | 5-28 | 2-12 | వృశ్చికం | 1-06 | 0-26 |
| ధనుస్సు | 5-35 | 2-14 | ధనుస్సు | 3-43 | 1-29 |
| మకరం | 5-11 | 2-05 | మకరం | 2-15 | 0-54 |
| కుంభం | 4-30 | 1-48 | కుంభం | 3-27 | 1-23 |
| మీనం | 4-02 | 1-37 | మీనం | 0-48 | 0-19 |

## గౌరీ పంచాంగము-పగలు

సూచన:- సూర్యోదయానంతరము మొదటి ముహూర్తము, రెండవ ముహూర్తము వలె అన్వయించుకోవలసినది.

| ముహూర్తం | ఆది | సోమ | మంగ | బుధ | గురు | శుక్ర | శని |
|---|---|---|---|---|---|---|---|
| మొదటి | ఉద్యోగం | అమృతం | రోగం | విషం | ఉద్యోగం | రోగం | విషం |
| రెండవ | లాభం | విషం | ఉద్యోగం | అమృతం | విషం | జ్వరం | అమృతం |
| మూడవ | విషం | ఉద్యోగం | జ్వరం | శుభం | జ్వరం | అమృతం | జ్వరం |
| నాల్గవ | అమృతం | లాభం | లాభం | ఉద్యోగం | లాభం | కలహం | ఉద్యోగం |
| ఐదవ | శుభం | జ్వరం | అమృతం | రోగం | అమృతం | శుభం | శుభం |
| ఆరవ | ధనం | అమృతం | ఉద్యోగం | శుభం | విషం | సుఖం | లాభం |
| ఏడవ | అమృతం | లాభం | విషం | ధనం | కలహం | ధనం | ధనం |
| ఎనిమిదవ | విషం | ధనం | లాభం | అమృతం | జ్వరం | అమృతం | లాభం |

## గౌరీ పంచాంగము-రాత్రి

సూచన:- సూర్యాస్తమయానంతరము మొదటి ముహూర్తము, రెండవ ముహూర్తము వలె అన్వయించుకోవలసినది.

| ముహూర్తం | ఆది | సోమ | మంగ | బుధ | గురు | శుక్ర | శని |
|---|---|---|---|---|---|---|---|
| మొదటి | శుభం | రోగం | జ్వరం | లాభం | శుభం | అమృతం | విషం |
| రెండవ | అమృతం | లాభం | ఉద్యోగం | రోగం | రోగం | జ్వరం | ఉద్యోగం |
| మూడవ | జ్వరం | ఉద్యోగం | కలహం | విషం | కలహం | కలహం | శుభం |
| నాల్గవ | రోగం | ధనం | లాభం | ఉద్యోగం | లాభం | లాభం | అమృతం |
| ఐదవ | కలహం | రోగం | రోగం | శుభం | ఉద్యోగం | శుభం | కలహం |
| ఆరవ | లాభం | అమృతం | లాభం | లాభం | జ్వరం | ధనం | రోగం |
| ఏడవ | ఉద్యోగం | విషం | ఉద్యోగం | ధనం | లాభం | అమృతం | అమృతం |
| ఎనిమిదవ | జ్వరం | జ్వరం | ధనం | లాభం | ఉద్యోగం | విషం | లాభం |

సూచన:- 1ముహూర్తము = 1గం॥ 30ని॥

## నామాద్యక్షర, నక్షత్ర రాశిగణ యోని వివరముల పట్టిక

| నామాద్యక్షరము | నక్షత్రపాదములు | గణము | జంతువు |
|---|---|---|---|
| చూచేచోలా | అశ్వి4-మేషం | దేవ | గుఱ్ఱం |
| లీలూలేలో | భర4-మేషం | మనుష్య | ఏనుగు |
| అఈఊఏ | కృత్తి1-మేషం, 3-వృష | రాక్షస | మేక |
| ఓవావీవు | రోహి4-వృషభం | మనుష్య | పాము |
| వేవోకాకి | మృగ2-వృష, 2-మిథున | దేవ | పాము |
| కూఖంజఛ | ఆర్ద్ర4-మిథునం | మనుష్య | కుక్క |
| కేకోహాహి | పున3-మిథున, 1-కర్కాట | దేవ | పిల్లి |
| హూహేహెూడా | పుష్య4-కర్కాటకం | దేవ | మేక |
| డీడూడేడో | ఆశ్లే4-కర్కాటకం | రాక్షస | పిల్లి |
| మామీమూమే | మఖ4-సింహం | రాక్షస | ఎలుక |
| మోటాటిటు | పుబ్బ4-సింహం | మనుష్య | ఎలుక |
| టేటోపాపి | ఉత్త1-సింహం, 3-కన్య | మనుష్య | గోవు |
| పూషంణాఠా | హస్త4-కన్య | దేవ | దున్న |
| పేపోరారి | చిత్త2-కన్య, 2-తుల | రాక్షస | పులి |
| రూరేరోత | స్వాతి4-తుల | దేవ | దున్న |
| తీతూతేతో | విశా3-తుల, 1-వృశ్చికం | రాక్షస | పులి |
| నానీనూనే | అనూ4-వృశ్చికం | దేవ | లేడి |
| నోయాయియూ | జ్యేష్ఠ4-వృశ్చికం | రాక్షస | లేడి |
| యేయోబాబి | మూల4-ధనుస్సు | రాక్షస | కుక్క |
| బుధాభాఢా | పూషా4-ధనుస్సు | మనుష్య | కోతి |
| బేబోజాజి | ఉషా1-ధను, 3-మకరం | మనుష్య | ముంగిస |
| జూజేజోఖా | శ్రవ4-మకరం | దేవ | కోతి |
| గాగీగూగే | ధని2-మకరం, 2-కుంభ | రాక్షస | సింహం |
| గోసాసీసూ | శత4-కుంభం | రాక్షస | గుఱ్ఱం |
| సేసోదాది | పూభా3-కుంభం, 1మీన | మనుష్య | సింహం |
| దుశ్యంఝాథా | ఉభా4-మీనం | మనుష్య | గోవు |
| దేదోచాచి | రేవ4-మీనం | దేవ | ఏనుగు |

| శిశు జనన నక్షత్ర పాద దోషముల పట్టిక | | | | |
|---|---|---|---|---|
| నక్షత్రము | 1వపాదము | 2వపాదము | 3వపాదము | 4వపాదము |
| అశ్వని | శిశువు,తండ్రి | మంచిది | మంచిది | మంచిది |
| భరణి | మంచిది | మంచిది | తల్లి,తండ్రి | మంచిది |
| కృత్తిక | మంచిది | మంచిది | తల్లి,తండ్రి | మంచిది |
| రోహిణి | తల్లి,మేన॥ | తల్లి,మేన॥ | మేనమామ | మంచిది |
| మృగశిర | మంచిది | మంచిది | మంచిది | మంచిది |
| ఆరుద్ర | మంచిది | మంచిది | మంచిది | స్వల్పదోషం |
| పునర్వసు | మంచిది | మంచిది | మంచిది | మంచిది |
| పుష్యమి | మంచిది | తల్లి,తండ్రికి | తల్లి,తండ్రికి | మంచిది |
| ఆశ్లేష | స్వల్పదోషం | ధనహాని | తల్లికిగండం | స్వల్పదోషం |
| మఖ | శిశుగండం | మంచిది | తల్లి,తండ్రికి | మంచిది |
| పుబ్బ | మంచిది | మంచిది | మంచిది | స్వల్పదోషం |
| ఉత్తర | తల్లి,తండ్రికి | మంచిది | మంచిది | స్వల్పదోషం |
| హస్త | మంచిది | మంచిది | తల్లి,తండ్రికి | మంచిది |
| చిత్త | తల్లి,తండ్రికి | తల్లి,తండ్రికి | స్వల్పదోషం | సామాన్య |
| స్వాతి | మంచిది | మంచిది | మంచిది | మంచిది |
| విశాఖ | బంధుగండం | బంధుగండం | విశే॥శాంతి | విశే॥శాంతి |
| అనూరాధ | మంచిది | మంచిది | మంచిది | మంచిది |
| జ్యేష్ఠ | సౌఖ్యహాని | ధననష్టం | తండ్రికి | సోదరునికి |
| మూల | తల్లి,తండ్రికి | తండ్రికి | ధనహాని | మంచిది |
| పూర్వాషాఢ | మంచిది | మంచిది | తల్లి,తండ్రికి | మంచిది |
| ఉత్తరాషాఢ | మంచిది | మంచిది | మంచిది | మంచిది |
| శ్రవణం | మంచిది | మంచిది | మంచిది | మంచిది |
| ధనిష్ఠ | మంచిది | మంచిది | మంచిది | మంచిది |
| శతభిషం | మంచిది | మంచిది | మంచిది | మంచిది |
| పూర్వాభాద్ర | మంచిది | మంచిది | మంచిది | స్వల్పదోషం |
| ఉ॥భాద్ర | మంచిది | మంచిది | మంచిది | మంచిది |
| రేవతి | మంచిది | మంచిది | మంచిది | శిశుగండం |

# భార్గవ సిద్ధాంత పంచాంగము

| గం॥ని. | గం॥ని. | ఆది | సోమ | మంగళ | బుధ | గురు | శుక్ర | శని |
|---|---|---|---|---|---|---|---|---|
| 6-00 | 6-24 | లాభం | వివాదం | ధనలాభం | దుర్వార్త | ధనలాభం | జయం | కష్టం |
| 6-24 | 6-48 | ధనలాభం | లాభం | సుఖం | మనోవ్యధ | కలహం | మిశ్రలాభం | సుఖం |
| 6-48 | 7-12 | కలహం | క్షేమం | భయం | ధనలాభం | భయం | ధనలాభం | విరోధం |
| 7-12 | 7-36 | అనారోగ్యం | ధనలాభం | కష్టములు | జయం | శుభం | శుభం | ధనలాభం |
| 7-36 | 8-00 | చోరభయం | భూలాభం | జయం | భయం | కార్యసిద్ధి | విరోధం | జయం |
| 8-00 | 8-24 | శత్రువృద్ధి | ధననష్టం | సుఖం | సుఖం | జయం | జయం | జయం |
| 8-24 | 8-48 | కార్యసిద్ధి | కార్యసిధి | సుఖం | సుఖం | ధనలాభం | హాని | లాభం |
| 8-48 | 9-12 | సుఖం | వస్తుప్రాప్తి | భయం | భీతి | లాభం | స్నేహం | సన్మానం |
| 9-12 | 9-36 | క్షేమం | ఇష్టసిద్ధి | విరోధం | ధనలాభం | కలహం | అశుభం | హాని |
| 9-36 | 10-00 | మిత్రవృద్ధి | హాని | భయం | మిశ్రమ | జయం | మిశ్రమ | అనారోగ్య |
| 10-00 | 10-24 | కార్యభంగం | స్త్రీలాభం | సుఖం | కార్యసిద్ధి | వృత్తిలాభం | సౌఖ్యం | సౌఖ్యం |
| 10-24 | 10-48 | సుఖం | సాధన | కార్యహాని | మిశ్రమ | శుభం | ధనలాభం | సంతాపం |
| 10-48 | 11-12 | జయం | కార్యహాని | మిశ్రమం | శుభం | ధనలాభం | క్షేమం | భయం |
| 11-12 | 11-36 | కార్యసిద్ధి | వివాదం | భయం | లాభం | ఆరోగ్యం | కార్యసిద్ధి | మిత్రప్రాప్తి |
| 11-36 | 12-00 | కలహం | కార్యసిద్ధి | కష్టం | శుభం | నష్టం | ప్రమాదం | జయం |
| 12-00 | 12-24 | ఇష్టసిద్ధి | ఇష్టలాభం | రోగపీడ | సౌఖ్యం | కార్యహాని | సుఖం | ధనం |
| 12-24 | 12-48 | భంగం | ధనం | లాభం | ఫలసిద్ధి | విరోధం | భయం | శుభం |
| 12-48 | 01-12 | జయం | జయం | సిద్ధి | క్షేమం | కార్యసిద్ధి | శుభం | మిశ్రమం |
| 01-12 | 01-36 | ఇష్టసిద్ధి | శుభం | కార్యహాని | మిశ్రమం | బంధనం | సుఖహాని | సిద్ధి |
| 01-36 | 02-00 | సంతాపం | మిశ్రమం | ఉద్యోగం | వివాదం | హాని | ధనహాని | జయం |
| 02-00 | 02-24 | ధనవ్యయం | సుఖం | వ్యర్ధం | ఇష్టసిద్ధి | కలహం | జయం | జయం |
| 02-24 | 02-48 | విరోధం | మనస్తాపం | హాని | లాభం | జయం | సౌఖ్యం | మిశ్రమం |
| 02-48 | 03-12 | ధనలాభం | కార్యసిద్ధి | అపజయం | ఉద్యోగం | కార్యహాని | భయం | విరోధం |
| 03-12 | 03-36 | శత్రువృద్ధి | ప్రయాణం | శత్రుజయం | విజయం | అశుభం | హాని | రోగపీడ |
| 03-36 | 04-00 | కలహం | ధనలాభం | ధనవ్యయం | ఇచ్ఛాసిద్ధి | స్నేహం | నష్టం | మనస్తాప |
| 04-00 | 04-24 | రోగం | విద్యాలాభం | సుఖం | శుభం | జయం | అపవాదం | లాభం |
| 04-24 | 04-48 | ధనలాభం | కార్యహాని | కార్యలాభం | క్షేమం | కలహం | భయం | కార్యసిద్ధి |
| 04-48 | 05-12 | కార్యసిద్ధి | గౌరవం | క్షేమం | జయం | మనోభీతి | కార్యహాని | లాభం |
| 05-12 | 05-36 | నష్టం | శుభం | కార్యసిద్ధి | ఉద్యోగం | జయం | కార్యజయ | సుఖం |
| 05-36 | 06-00 | భూలాభం | అధికారం | సౌఖ్యం | అశుభం | కార్యసిద్ధి | ధనలాభం | జయం |

సూచన:- ప్రతిరోజూ సూర్యోదయం నుండి 24 ని॥ల చొప్పున ఫలితము చూడాలి.

సూచన:- తిథి, వార, నక్షత్రములు బాగుగా లేని దినములలోనూ, ముహూర్తములు లేని దినములలోనూ దీనిని అనుసరించుట శ్రేయోదాయకం.

## ప్రయాణమునకు ఆనందాది యోగములు

| యోగాలు | ఆది | సోమ | మంగ | బుధ | గురు | శుక్ర | శని | ఫలములు | రోజులు |
|---|---|---|---|---|---|---|---|---|---|
| ఆనందయోగం | అశ్వ | మృగ | ఆశ్లే | హస్తా | అనూ | ఉషా | శత | ద్రవ్యలాభం | 15 |
| కాలదండ | భర | ఆర్ద్ర | మఖ | చిత్త | జ్యేష్ఠ | అభి | పూభా | విఘ్నం | 27 |
| ధూమ్రయోగం | కృత్తి | పున | పుబ్బ | స్వాతి | మూల | శ్రవ | ఉభా | హాభాని | 8 |
| ధాతృయోగం | రోహి | పుష్య | ఉత్త | విశా | పూషా | ధని | రేవ | కార్యసిద్ధి | 4 |
| సౌమ్యయోగం | మృగ | ఆశ్లే | హస్తా | అనూ | ఉషా | శత | అశ్వ | సుఖము | 30 |
| ధ్వాంక్షయోగం | ఆర్ద్ర | మఖ | చిత్త | జ్యేష్ఠ | అభి | పూభా | భర | విఘ్నం | 5 |
| ధ్వజయోగం | పున | పుబ్బ | స్వాతి | మూల | శ్రవ | ఉభా | కృత్తి | రాజ్యలాభం | 10 |
| శ్రీవత్సయోగం | పుష్య | ఉత్త | విశా | పూషా | ధని | రేవ | రోహి | లక్ష్మీప్రదం | 3 |
| వజ్రయోగం | ఆశ్లే | హస్తా | అనూ | ఉషా | శత | అశ్వ | మృగ | కలహము | 2 |
| ముద్గరయోగం | మఖ | చిత్త | జ్యేష్ఠ | అభి | పూభా | భర | ఆర్ద్ర | మరణము | 1 |
| ఛత్రయోగం | పూబ్బ | స్వాతి | మూల | శ్రవ | ఉభా | కృత్తి | పున | రాజ్యలాభం | 3 |
| మిత్రయోగం | ఉత్త | విశా | పూషా | ధని | రేవ | రోహి | పుష్య | కార్యసిద్ధి | 5 |
| మానసయోగం | హస్తా | అనూ | ఉషా | శత | అశ్వ | మృగ | ఆశ్లే | స్త్రీలాభం | 2 |
| పద్మయోగం | చిత్త | జ్యేష్ఠ | అభి | పూభా | భర | ఆర్ద్ర | మఖ | ఐశ్వర్యం | 1 |
| లంబయోగం | స్వాతి | మూల | శ్రవ | ఉభా | కృత్తి | పున | పుబ్బ | కార్యహాని | 3 |
| ఉత్పాతయోగం | విశా | పూషా | ధని | రేవ | రోహి | పుష్య | ఉత్త | ద్రవ్యనాశం | 4 |
| మృత్యుయోగం | అనూ | ఉషా | శత | అశ్వ | మృగ | ఆశ్లే | హస్తా | హాని | 10 |
| కాలయోగం | జ్యేష్ఠ | అభి | పూభా | భర | ఆర్ద్ర | మఖ | చిత్త | కార్యహాని | 5 |
| సిద్ధయోగం | మూల | శ్రవ | ఉభా | కృత్తి | పున | పుబ్బ | స్వాతి | కార్యసిద్ధి | 7 |
| శుభయోగం | పూషా | ధని | రేవ | రోహి | పుష్య | ఉత్త | విశా | కార్యసిద్ధి | 6 |
| అమృతయోగం | ఉషా | శత | అశ్వ | మృగ | ఆశ్లే | హస్తా | అనూ | స్త్రీసంతోషం | 2 |
| ముసలయోగం | అభి | పూభా | భర | ఆర్ద్ర | మఖ | చిత్త | జ్యేష్ఠ | భోజనహాని | 8 |
| గదాయోగం | శ్రవ | ఉభా | కృత్తి | పున | పుబ్బ | స్వాతి | మూల | అశుభము | 40 |
| మాతంగ | ధని | రేవ | రోహి | పుష్య | ఉత్త | విశా | పూషా | స్వర్ణలాభం | 2 |
| రాక్షసయోగం | శత | అశ్వ | మృగ | ఆశ్లే | హస్తా | అనూ | ఉషా | క్లేశము | 9 |
| చరయోగం | పూభా | భర | ఆర్ద్ర | మఖ | చిత్త | జ్యేష్ఠ | అభి | దుర్వార్త | 8 |
| స్థిరయోగం | ఉభా | కృత్తి | పున | పుబ్బ | స్వాతి | మూల | శ్రవ | కార్యసిద్ధి | 3 |
| వర్ధమాన | రేవ | రోహి | పుష్య | ఉత్త | విశా | పూషా | ధని | అధికలాభం | 10 |
| విషయోగం | కృత్తి | చిత్త | రోహి | భర | అనూ | శ్రవ | రేవ | నష్టము | 5 |

# వింశోత్తరీ దశాన్తర్దశా చక్రము

| రవి మహాదశాసం॥ 6 | |
|---|---|
| భుక్తి | సం - నె - రో |
| రవి | 0 - 3 - 18 |
| చంద్ర | 0 - 6 - 0 |
| కుజ | 0 - 4 - 6 |
| రాహు | 0 -10- 24 |
| గురు | 0 - 9 - 18 |
| శని | 0 -11- 12 |
| బుధ | 0 -10- 06 |
| కేతు | 0 - 4 - 6 |
| శుక్ర | 1 - 0 - 0 |

| చన్ద్రమహాదశా సం॥ 10 | |
|---|---|
| భుక్తి | సం - నె - రో |
| చంద్ర | 0 -10- 0 |
| కుజ | 0 - 7 - 0 |
| రాహు | 1 - 6 - 0 |
| గురు | 1 - 4 - 0 |
| శని | 1 - 7 - 0 |
| బుధ | 1 - 5 - 0 |
| కేతు | 0 - 7 - 0 |
| శుక్ర | 1 - 8 - 0 |
| రవి | 0 - 6 - 0 |

| కుజమహాదశా సం॥ 7 | |
|---|---|
| భుక్తి | సం - నె - రో |
| కుజ | 0 - 4 - 27 |
| రాహు | 1 - 0 - 18 |
| గురు | 0 -11 - 06 |
| శని | 1 - 1 - 09 |
| బుధ | 0 -11 - 27 |
| కేతు | 0 - 04- 27 |
| శుక్ర | 1 - 02 - 0 |
| రవి | 0 - 04 - 6 |
| చంద్ర | 0 - 07 - 0 |

| రాహు మహాదశాసం॥ 18 | |
|---|---|
| భుక్తి | సం - నె - రో |
| రాహు | 2 - 8 - 12 |
| గురు | 2 - 4 - 24 |
| శని | 2 -10- 6 |
| బుధ | 2 - 6 -18 |
| కేతు | 1 - 0 -18 |
| శుక్ర | 3 - 0 - 0 |
| రవి | 0 -10 -24 |
| చంద్ర | 1 - 6 - 0 |
| కుజ | 1 - 0 - 18 |

| గురు మహాదశా సం॥ 16 | |
|---|---|
| భుక్తి | సం - నె - రో |
| గురు | 2 - 1 - 18 |
| శని | 2 - 6 - 12 |
| బుధ | 2 - 3 - 6 |
| కేతు | 0 -11- 6 |
| శుక్ర | 2 - 8 - 0 |
| రవి | 0 - 9 - 18 |
| చంద్ర | 1 - 4 - 0 |
| కుజ | 0 -11- 6 |
| రాహు | 2 - 4 - 24 |

| శని మహాదశా సం॥ 19 | |
|---|---|
| భుక్తి | సం - నె - రో |
| శని | 3 - 0- 3 |
| బుధ | 2 - 8- 9 |
| కేతు | 1 - 1- 9 |
| శుక్ర | 3 - 2- 0 |
| రవి | 1 -11 - 12 |
| చంద్ర | 1 - 7 - 0 |
| కుజ | 1 - 1 - 9 |
| రాహు | 2 -10 - 6 |
| గురు | 2 - 6 - 12 |

| బుధ మహాదశా సం॥ 17 | |
|---|---|
| భుక్తి | సం - నె - రో |
| బుధ | 2 - 4 - 27 |
| కేతు | 0 -11 - 27 |
| శుక్ర | 2 -10 - 0 |
| రవి | 0 -10 - 6 |
| చంద్ర | 1 - 5 - 0 |
| కుజ | 0 -11 - 27 |
| రాహు | 2 - 6 - 18 |
| గురు | 2 - 3 - 6 |
| శని | 2 - 8 - 9 |

| కేతు మహాదశా సం॥ 7 | |
|---|---|
| భుక్తి | సం - నె - రో |
| కేతు | 0 - 4 - 27 |
| శుక్ర | 1 - 2 - 0 |
| రవి | 0 - 4 - 6 |
| చంద్ర | 0 - 7 - 0 |
| కుజ | 0 - 4 - 27 |
| రాహు | 1 - 0 - 18 |
| గురు | 0 -11- 6 |
| శని | 1 - 1 - 9 |
| బుధ | 0 -11 -27 |

| శుక్ర మహాదశాసం॥ 20 | |
|---|---|
| భుక్తి | సం - నె - రో |
| శుక్ర | 3 - 4 - 0 |
| రవి | 1 - 0 - 0 |
| చంద్ర | 1 - 8 - 0 |
| కుజ | 1 - 2 - 0 |
| రాహు | 3 - 0 - 0 |
| గురు | 2 - 8 - 0 |
| శని | 3 - 2 - 0 |
| బుధ | 2 -10- 0 |
| కేతు | 1 - 2 - 0 |

## బల్లి లేదా తొండ పడుట వలన కలుగు శుభాశుభములు

| స్త్రీలకు | | పురుషులకు | |
|---|---|---|---|
| చేతియందు | ధననష్టం | చేతియందు | ధననష్టం |
| కుడిచేయి | ధనలాభం | మణికట్టుయందు | అలంకారప్రాప్తి |
| ఎడమచేయి | మనోచలనం | మోచేయి | ధననష్టం |
| వ్రేళ్ళపై | భూషణప్రాప్తి | వ్రేళ్ళపై | స్నేహితులరాక |
| తలమీద | ప్రాణభయం | తలమీద | కలహం |
| కొప్పుపై | రోగభయం | బ్రహ్మరంధ్రమున | మృత్యువు |
| పిక్కలు | బంధుదర్శనం | ముఖము | ధనలాభం |
| ఎడమకన్ను | భర్త ప్రేమ | ఎడమ కన్ను | శుభం |
| కుడి కన్ను | మనోవ్యధ | కుడికన్ను | అపజయం |
| వక్షమున | సుఖము | నుదురు | బంధుసన్యాసం |
| కుడిభుజం | రతిసౌఖ్యం | కుడిభుజం | కష్టం |
| బాహువులు | భూషణప్రాప్తి | ఎడమ భుజం | అగౌరవము |
| తొడలు | వ్యభిచారం | తొడలపై | వస్త్రనాశనము |
| మోకాళ్ళ యందు | బంధనం | మీసాలుపై | కష్టము |
| చీలమండ యందు | కష్టము | పాదములు | కష్టము |
| కుడికాలిపై | శతృనాశనం | పాదముల వెనుక | ప్రయాణము |
| కాలివ్రేళ్ళు | పుత్రలాభం | కాలివ్రేళ్ళు | గోడపీడలు |
| పెదవులు | కష్టం | రెండు పెదవులపై | మృత్యువు |
| స్తనములు | అధికదుఃఖం | నోటియందు | రోగప్రాప్తి |
| వీపుయందు | మరణవార్త | ఎడమ మూపు | జయం |
| గోళ్ళపై | కలహము | కుడి మూపు | రాజభయం |
| కుడిచెంప | పుత్రలాభం | కుడిచెంప | దుఃఖం |
| కుడి చెవి | ధనలాభము | ఎడమ చెవి | లాభం |
| పై పెదవి | విరోధము | పై పెదవి | కలహం |
| క్రిందిపెదవి | నూతన వస్తులాభం | క్రింద పెదవి | ధనలాభం |

సూచన:– బల్లి లేదా తొండ శరీరం మీద పడిననూ లేదా పాకిననూ తలస్నానము చేసి, పరమేశ్వర ప్రీతికై నువ్వుల నూనె తో దీపారాధన చేసి 'ఓం మృత్యుంజయాయ నమః' అని వీలయినంత జపించినచో దోష పరిహారమగును.

## వ్యవసాయము ఆరంభించుటకు కాలము

అనూరాధా, హస్తా, చిత్త, స్వాతి, రోహిణి, ధనిష్ఠ, మఖ, అశ్విని, ఉత్తర ఫల్గుణి, ఉత్తరాషాఢ, ఉత్తరాభాద్రా, రేవతి, మూల మొదలగు నక్షత్రములును, భౌమ, భాను, బుధ, శుక్రవారములును, భూమిదున్నుటను ఆరంభించుట చేత శుభము గలుగును. సోమవారము మధ్యమఫలితప్రదము. రిక్తతిథులును, దగ్ధ తిథులును, పాడ్యమియును, అమావాస్యయును, అవమయును, వైధృతియును, వ్యాఘాతయునూ, వ్యతీపాతయోగములును, భద్రవాకరణమును విడిచిపెట్టి పైన తెల్పిన రీతిలో శుభదినమునెంచి కృష్యారంభముచేయుటచే శుభము కలుగును.

## ఏరువాకకు యుక్త కాలము

విశాఖా, హస్తా, మృగశిర, మఖ, పునర్వసు, రోహిణి, అశ్విని, శ్రవణం, ధనిష్ఠ, శతభిషం, ఉత్తర, ఉత్తరాషాఢా, ఉత్తరాభాద్రా, మూల, రేవతి, స్వాతి, అనూరాధా, పుష్యమి నక్షత్రములయందునూ, కుజ, గురు, భాను వారముల యందునూ, వృషభము, మీనము, మిథునము, కన్య, ధనుస్సు, వృశ్చిక లగ్నముల యందునూ కృషినారంభించుట చేత నానా విధములైన శుభ ఫలములు కలుగును. తులాలగ్నమందు కృషి నారంభించిన ప్రాణహాని కలుగును. మకరము నందు ఆరంభించిన సస్యనాశమును, కుంభమునందారంభించిన చోరభయమును, మేషము నందు ఆరంభించిన పశుహానియు, కర్కాటకము నందు ఆరంభించిన దహనమును, సింహమందారంభించిన యెడల సర్పముల వలన మనుష్యులకు భయమును గలుగునని ఆర్ష వాణి.

## చెరకు, అరటి, మామిడి మొదలగు చెట్లు వేయుటకు యుక్త కాలము

రేవతి, ఉత్తర, రోహిణి, పుష్యమి, హస్తా, పునర్వసు, మూల, స్వాతి, శతభిషం, అశ్విని అను పది నక్షత్రములును, గురు, బుధ, సోమ వారములును, కన్యా, కర్కట, మిథున, వృషభ, మీన, మకర రాశులును, అన్ని విత్తనములు నాటుటకు, కృషినారంభించుటకు, విత్తనములు చల్లుటకును ప్రశస్తములైనవి. ఈ రీతిలో ముహూర్తములు చూచి ప్రారంభించిన యెడల సంపూర్ణముగా సకల సస్యములు ఫలించునని మహర్షుల వాణి.

## ఉల్లితోట వేయుటకు యుక్తకాలము

రేవతి, అశ్విని, అనూరాధా, స్వాతి, శతభిషం, పునర్వసు, పుష్యమి, ఉత్తర, హస్తా, జ్యేష్ఠ, శ్రవణము, మూల, మృగశిర ఈ 13 నక్షత్రములును, ఆది, గురు, సోమవారములును, పంచమీ, దశమీ, పూర్ణిమా తిథులును, మకర, మీన, వృశ్చిక, ధను, కుంభ లగ్నములును ఉల్లి విత్తనములు పాతిపెట్టుటకు మేలని వశిష్ఠాది మహామునులు చెప్పిరి.

## శనగ విత్తనములు మొదలగునవి చల్లుటకును, విత్తనములు కట్ట కట్టుటకును యుక్తకాలము.

మూల, ఉత్తర, ఉత్తరాషాఢా, ఉత్తరాభాద్రా, శ్రవణము, మృగశిర, పునర్వసు, ధనిష్ఠా, రేవతి, రోహిణి, అనూరాధా, స్వాతి ఈ 12 నక్షత్రములును, కటకము, ధనుస్సు, తులా, వృషభము, సింహము, వృశ్చికము, కుంభ లగ్నములందునూ, బుధ, గురు, శుక్ర వారములయందునూ, శనగ, గోధుమ, కందులు ఈ విత్తనాలు చేలయందు చల్లుట చేత అధికముగా ఫలించునని యెరుంగవలెను. మరియు మూల, ఉత్తర, ఉత్తరాషాఢా, ఉత్తరాభాద్రా, విశాఖా, అనూరాధా, మఖ, శ్రవణము, రేవతి, పుష్యమి ఈ 10 నక్షత్రములయందు నానా జాతి విత్తనములను మూటలు కట్టి పెట్టుటచే నానా విధములగు శుభములు కలుగునని తాత్పర్యము.



## మౌఢ్యమునందు చేయతగని కార్యములు

గురు, శుక్రులలో ఎవరైననూ అస్తంగతుడయినచో; బావి, కొలను, చెఱువు త్రవ్వుట, యాగము, గమనము, క్షురకర్మ, దేవతాప్రతిష్ఠ, వివాహోపనయనములు, విద్యారంభము, నూతన గృహారంభము, కర్ణవేధ, మహాదానములు, వనములు స్థాపించుట, పుణ్యతీర్థములు సేవించుట, నూతన మంత్రానుష్ఠానము చేయుట, పట్టాభిషేకములు, వివాహాది శుభకార్యాలు, మొదలగు సమస్త శుభ కర్మములు చేయుట వర్జింపవలయును. పై కార్యక్రమములు క్షయమాస మరియూ అధిక మాసాదులందు గూడా చేయకూడదు.

## మౌఢ్యమందు చేయతగిన కార్యములు

ఆశ్లేషా, జ్యేష్ఠా, మూలాది గండనక్షత్ర శాంతులునూ, రోగ సంబంధమైన జపహోమాది శాంతులునూ, నవగ్రహశాంతియునూ, అభిషేకము, సమస్త వ్రతములు, ఉత్పాత దోషములు మొదలగు వాని శాంతులుయునూ, మాస ప్రయుక్తములగు పుంసవనాది కార్యములునూ గురు, శుక్ర మౌఢ్యములలో ఆచరించిననూ దోషములు కానేరవు.

## కర్తరియందు చేయకూడని కార్యములు

శ్లో॥ వృక్షచ్ఛేదనవల్కలం కృషితృణం బీజంచ భూఘాతనమ్।
గ్రామారంభ గృహప్రవేశ వనితాసంభోగ శయ్యాసనమ్।
యాత్రారామ తటాకకూప శకటాశ్వారోహ దేవాలయమ్।
సూర్యేవహ్నిభ సంస్థితేచదివసే కర్మాణి సంవర్జయేత్॥

కర్తరి యందు చెట్లునరుకుట, నూతన వస్త్ర ధారణ, చించుట, కుట్టుట, భూమిని దున్నుట, గడ్డికోయుట, విత్తనములు చల్లుట, గ్రామారంభ, గృహారంభ, దేవాలయారంభ, గృహకర్మ, స్త్రీసంభోగము, కొత్తమంచము చేయించుట, దానిని వాడుట, పీట,కుర్చి, ఇత్యాదులు చేయించుట వానిని క్రొత్తగా వాడుట, యాత్ర చేయుట, తోటలు నాటుట, చెరువులు మరియూ భావులు త్రవ్వించుట, బండ్లుచేయుట మరియూ వాడుట, వంటి కార్యములు రవి కృత్తికా నక్షత్రంలో ఉండగా అనగా వాస్తు కర్తరి యందు చేయగూడనివి.

## కర్తరియందు చేయతగిన కార్యములు

శ్లో॥ మౌంజీబంధ వివాహేచ ప్రతిష్ఠా యజ్ఞకర్మణి।
భరణ్యాం కృత్తికాంచైవ న దోషో మంటపాదిషు॥

తా॥ కర్తరియందు ఉపనయనము, వివాహము, ప్రవేశము, దేవప్రతిష్ఠ, యజ్ఞము, మంటపాదులు కట్టుట ఇట్టి కార్యములు చేయవచ్చును.

## జన్మనక్షత్రమందు చేయతగిన కార్యములు

నిషేకము, యాగము, చౌలము, అన్నప్రాశనము, వ్యవసాయము, ఉపనయనము, పట్టాభిషేకము, భూ సంపాదనము, అక్షరాభ్యాసము, ఇట్టి కార్యములు జన్మ నక్షత్రమందు చేయవచ్చును.

## జన్మనక్షత్రమందు చేయతగని కార్యములు

పుంసవనము, యుద్ధము, సీమంతము, గర్భాదానము, శ్రాద్ధము, క్షౌరము, ఔషధసేవనము, ప్రయాణము, వివాహము చేయకూడదు. మరియును స్త్రీలకు వివాహ విషయమందు జన్మ నక్షత్రము శ్రేష్ఠమని గ్రంథాంతరమందు చెప్పియుండుట చేత ఈ వివాహ నిషేధము పురుషుని విషయమందేనని తెలియవలెను.

## తారాబలమును చూచుట

జన్మనక్షత్రము/నామనక్షత్రము మొదలు దిన నక్షత్రము వరకు ఎంచి ఆ సంఖ్యను తొమ్మిదిచే భాగించగా మిగిలిన సంఖ్య 1.జన్మతార, 2.సంపత్తార, 3.విపత్తార, 4.క్షేమతార, 5.ప్రత్యక్తార, 6.సాధన తార, 7.నైధనతార, 8.మిత్రతార, 9.పరమమిత్రతార అని తెలుసుకొనవలెను.

పైన చెప్పబడిన తొమ్మిది తారలలో జన్మతార వలన దేహనాశమును, సంపత్తార వలన సంపదయు, విపత్తార వలన కార్యనాశమును, క్షేమతార వలన క్షేమమును, ప్రత్యక్తార వలన కార్యహానియు, సాధనతార వలన కార్య సాధనమును, నైధనతార వలన మరణమును, మిత్రతార వలన సుఖ సంపదృద్ధియు, పరమ మైత్రతార వలన దేహసౌఖ్యమును కలుగును.

శ్లో॥ ప్రథమే ప్రథమం త్యాజ్యం ద్వితీయేచ తృతీయకమ్।
తృతీయే పంచమం త్యాజ్యం నైధనం త్రిషు వర్జయేత్॥

తా॥ పరిగణనమున 1వ పర్యాయము జన్మతారయు, 2వ పర్యాయము విపత్తారయు, 3వ పర్యాయము ప్రత్యక్తారయు, మూడు పర్యాములందు నైధన తారయు పనికి రానేరవు.

## అశుభ తారలయందు మిక్కిలి క్రూరకాలము

జన్మతారయందు 3వ పాదము, విపత్తారయందు 1వ పాదము, ప్రత్యక్తార యందు 4వ పాదము, నైధనతారయందు 2వ పాదము.

## అశుభ తారలకు దానములు

జన్మతారకు శాకము, విపత్తారకు గుడము, ప్రత్యక్తారకు లవణము, నైధనతారకు తిలసహిత కాంచనము. ఏదేని గడ్డు పరిస్థితిలో శుభకార్యము తారబలము కుదరని స్థితిలో చేయవలసి వచ్చినచో నవగ్రహ శాన్తి జరిపి పై దానములను ఇవ్వవలసినది.

## చంద్రబలమును చూచుట

చంద్రబలము:- జన్మరాశి (లేక నామరాశి) మొదలు 1,3,6,7,10,11 రాశులయందు చంద్రుడు శుభుడు. 2,4,5,8,9,12 రాశులయందు అశుభుడు. శుక్ల పక్షమున 2,5,9 రాశులయందునూ, కృష్ణ పక్షమున 4,8,12 రాశులయందు శుభుడు.

## కుజదోషము

వధూవరుల జాతకములలో కుజుడు 2,4,7,8,12 స్థానములలో ఏదేని స్థానమందుండెనేని కుజదోషమని యెరుంగవలెను. ఈ దోషమువలన పురుషునకు భార్యా వియోగము, స్త్రీకి భర్తృ వియోగమును కలుగును. కుజ దోషము జన్మ లగ్నము నుండియేగాక చంద్ర లగ్నము నుండియూ, శుక్ర లగ్నమునుండియూ చూడవలెను. పురుష జాతకమున శుక్రుడు కుజునికంటే బలముగా ఉండిననేని కుజదోషము తగ్గును. స్త్రీ జాతకమున కుజుడు శుక్రునికంటే స్వల్ప బలవంతుడైననేని దోషము తగ్గును.

## కుజ దోష అపవాదములు

కటక, సింహ, మకర లగ్నములందు, మరియూ కుజ మిత్ర లగ్నములందు జన్మించినవారికి కుజదోషము లేదు. మరియూ,

1. మిథున, కన్య లగ్న జాతకులకు ద్వితీయస్థ కుజునిచే దోషము లేదు.
2. వృషభ తుల లగ్న జాతకులకు వ్యయస్థ కుజునిచే దోషము లేదు.
3. మేష, వృశ్చిక లగ్న జాతకులకు చతుర్ధస్థ కుజునిచే దోషము లేదు.
4. మకర, కర్కాటక లగ్న జాతకులకు సప్తమస్థ కుజునిచే దోషము లేదు.
5. ధనుర్మీన లగ్న జాతకులకు అష్టమస్థ కుజునిచే దోషము లేదు.
6. సింహ కుంభ లగ్న జాతకులకు అసలు కుజ దోషమే వర్తించదు.

### అపి

కుజుడు బృహస్పతితోగానీ, చంద్రునితోగానీ, శనితోగానీ చేరిననూ సప్తమ దృష్టితో చూచుకున్ననూ కుజదోషము లెక్కింపతగినది కాదు. వధూవరులకు పైన చెప్పినట్లు 2,4,7,8,12 స్థానములందు ఉభయులకు కుజుడుండిన యెడల దోషము లేదు. కుజ దోషము వధూవరులిరువురి జాతకములందుండినచో దోషోపశమనమై దీర్ఘకాలం దాంపత్యసుఖమనుభవించి పుత్రారామ ధనక్షేత్రాదులతో సుఖింతురు. ఒకరి జాతకమందే యుండిన ఎడల కష్టనష్టములు కలుగునని దేవకేరళమందు చెప్పబడినది.

పురుషులకు 2,7యందును, స్త్రీలకు 4,12యందును మరియూ ఉభయులకు అష్టమమందును కుజుడుండెనేని కుజదోషము తప్పదని పెద్దల అభిప్రాయము.

## బాలారిష్టదోషము

లగ్నకుండలియందు లగ్నాత్ చంద్రుడు ఎనిమిదింటను, కుజుడు ఏడింటను, రాహువు తొమ్మిదింటను, శని 1వ ఇంటను, గురుడు మూడింటను, రవి ఐదింటను, శుక్రుడు ఆరింటను, బుధుడు నాలుగింటను, కేతువు వ్యయమున, ఉన్న పక్షమున బాలారిష్ట దోషములు సంభవించును.

శిశువు జన్మించిన లగ్నమునకు 1,5,6,7,8,12 రాశులయందు పాపగ్రహములుండినను లేక పాప గ్రహముచే జూడబడిననూ, మరియు క్షీణ చంద్రుడు 8వ రాశి యందుండిననూ బాలారిష్ట దోషములు సంభవించును.

జన్మకాలమున అష్టమాధిపతి దశ వచ్చినచో బాలారిష్టము కల్గును. లగ్నమందు శనియు, సప్తమమందు రవియు, అష్టమమందు కుజుడును ఉండి చంద్రుడు పాప గ్రహముచే జూడబడిన బాలారిష్టము. కుజుడు లగ్నమందును శని షష్ఠమమందు గాని అష్టమమందు గాని ఉన్న యెడల బాలారిష్టము. చంద్రుడు శని, రాహువులతో కలిసి లగ్నమందుండి అంగారకుడు అష్టమమందున్న యెడల బాలారిష్టము.

## బాలారిష్ట దోష భంగములు

శిశుజన్మలగ్నమునకు పై రాశులందు ఆయా గ్రహములుండిననూ, ఆయా రాశులను బలమగు శుభగ్రహములు చూచిననూ, కేంద్రములందు ఒక శుభ గ్రహముండిననూ దోషము లేదు.

లగ్నాధిపతి బలవంతుడై శుభగ్రహ వీక్షణము కలిగియున్న బాలారిష్టము లేదు. పూర్ణచంద్రుడు శుభాంశ యందుండి శుక్రునిచే చూడబడిన బాలారిష్టము లేదు. గురుశుక్రులు కేంద్రములయందున్న బాలారిష్టము లేదు. శుక్ల పక్షమున రాత్రియందైననూ కృష్ణ పక్షమున పగటియందైననూ జన్మించిన బాల అరిష్టము లేదు.

## వివాహానంతరము చేయతగని కార్యక్రమములు

కుటుంబమునందొకరికి వివాహము జరిగిన 6మాసముల లోగా చెవులు కుట్టుట, ఉపనయనము, తీర్థయాత్ర, ఇల్లు కట్టుట, వ్రత, ఉద్యాపన, మొదలైన కార్యములు పనికిరావు. సంవత్సర ఋతు భేదములున్నచో పనికి వచ్చునని కొందరి మతము.

**శ్లో॥ కర్ణవేధన మౌంజ్యాది తీర్థయాత్రాది వేశ్మని।**
**వ్రతోద్యాపన కర్మాణి నిందితాని మహర్షిభిః॥**

## వర్ణముల రీత్యా వివాహమునకు చూచు పొంతన

**శ్లో॥ గ్రహమైత్రం ద్విజాతీనాం** క్షత్రియాణాం గణస్తథా।
**కన్యాదూరంతు వైశ్యానాం శూద్రాణాం యోనిరేవచ॥**

బ్రాహ్మణులు గ్రహమైత్రవర్గమును, క్షత్రియులు, గణవర్గమును, వైశ్యులు స్త్రీదీర్ఘవర్గమును, శూద్రులు యోనివర్గమును నియతముగా విచారించి స్త్రీ పురుషులకు దాంపత్యమును నిర్ణయించవలెను. ఇతర వర్గములు అప్రధానములు.

అభ్యుచ్ఛయ సాధనములుగా భావించవలెను.

ఈ ఇతర వర్గములు సైతం దేశబేధముచే ప్రత్యేకముగా ప్రాధాన్యము పొందుచూ ప్రాధాన్యమును గడించుచునేయున్నవి. వైఫల్యమేమాత్రమును లేదుయని సమయ శాస్త్ర పారదృశ్యలు చెప్పుచున్నారు.

## లగ్నములయందు వదలతగిన కాలము

మేష, వృషభ, ధనుః, కన్యా లగ్నముల ఆదియందు భుజంగమను పేరుతోనూ, మీన, మకర, కర్కట, వృశ్చికము లగ్నముల అంత్యమున రాహువను పేరుతోనూ, మిథున, కుంభ, తులా, సింహముల మధ్యభాగమందు గృధ్రమను పేరుతోనూ అరఘడియ లగ్నత్యాజ్యము కలదు. కనుక త్యాజ్యకాలమును విడువవలయును. మరియు కాల విధానమందు;

**శ్లో॥ లగ్నస్యాదౌ విషంత్యక్త్వా పశ్చాత్కర్మాణి కారయేత్।**
**తల్లగ్నం వర్జయేద్ధీమాన్ లగ్నస్యాన్తే విషం యది॥**

లగ్నమునకు ఆదియందు విషఘడియలు వచ్చినచో ఆ ఘడియలను మాత్రము త్రోసి శుభ కర్మలు చేయవచ్చును. లగ్నాన్తమన్దు విషఘడియలు తగిలిన లగ్నమునే విడువవలెను.

## పంచక రహితమును గణించుట

### 1. ధృవక పంచక రహిత గణన పద్ధతి

**శ్లో॥ శృతిః బాణః ఋతుః పంచ వేద త్రీణి ద్వి చంద్రమాః।**
**గగనేందు ద్వయం త్రీణి ధృవకంచేత్యనుక్రమాత్॥**

ఈ పద్ధతియందు లగ్నములకు ధృవకములుగలవు, అవి, మేషమునకు-4, వృషభమునకు-5, మిధునమునకు-6, కర్కాటకమునకు-5, సింహమునకు-4, కన్యకు-3, తులకు-2, వృశ్చికమునకు-1, ధనస్సునకు-0, మకరమునకు-1, కుంభమునకు-2, మీనమునకు-3.

ముహూర్తమును నిర్ణయింపబోవు దినమునకు గల తిథి, వార, నక్షత్ర, లగ్నములను క్రమముగా ప్రతిపదాదిగా, భానువారాదిగా, అశ్విన్యాదిగా, మేషాదిగా లెక్కించి ఆ మొత్తమునకు లగ్న ధృవక సంఖ్యను కలిపగా, వచ్చిన మొత్తమును

తొమ్మిదితో భాగించగా మిగిలిన శేషము 1 వచ్చిననేని మృత్యుపంచకమనియూ, శేషం 2వచ్చినచో అగ్నిపంచకమనియూ, 3 శుభ పంచకమనియూ 4 మిగిలినచో రాజపంచకమనియూ, 5-అమృత పంచకమనియూ 6 మిగిలినచో చోరపంచకమని, 7. శోభన పంచకమనియూ 8 వచ్చినచో రోగపంచకమని తెలుసుకొనవలెనను. శేషం 1,2,4,6,8 వచ్చినచో పంచకరహితం కాలేదని; 3,5,7,9 శేషం వచ్చినచో ధృవకపంచకరహితమైనదని గ్రహించవలెను.

మృత్యు, అగ్ని, రాజ, చోర, రోగ పంచకములు త్యాజ్యములు. అందునా చోర, రోగములు రాత్రియందును రోగాగ్నులు పగటి యందునూ, మృత్యువు దివారాత్రములయందు పనికి రానేరవు. రాజసేవకు రాజపంచకం, ప్రయాణమునకు చోరపంచకం, వివాహ ఉపనయనములకు రోగ మృత్యు పంచకములు పనికిరావు. అవసరమై ఆచరించవలసి వచ్చినపుడు మృత్యు, అగ్ని, రాజ, చోర, రోగ పంచకములకు క్రమముగా 1.రత్నములు, 2.చందనము, 3.నిమ్మపండ్లు, 4.దీపము, 5.ధాన్యము దానము చేసిన దోష పరిహారమగునని కొందరి మతము. ఆ దానములు కాక 1.శాక, 2.గుడ, 3.లవణ, 4.సతిలహిరణ్యం, 5.బంగారము వీటిని దానము చేయవలెనని కొందరిమతము.

భిన్న గ్రంధముల రీత్యా పంచకరహితమును గణించుట భిన్నరీతులలో కలదు. ప్రాంతాచారముననుసరించి గణింపతగును. క్రింద వేరు విధానమున పంచక రహితమును గణించు రీతి సైతం తెలియజేయబడుచున్నది.

## 2. పక్షక పంచకరహితం

**శ్లో॥ తిథిరోడుభిర్యుక్తం తత్కాలోదయ మిశ్రితమ్।**
**నవభిస్తు హరేద్భాగం శేషం పంచకమీరితమ్॥**

తిథి, వార, నక్షత్ర, లగ్న సంఖ్యలను కలిపి 9చే భాగించగా శేషం 1 వచ్చిననేని మృత్యుపంచకమనియూ, శేషం 2 వచ్చినచో అగ్నిపంచకమనియూ, శేషం 4 వచ్చినచో రాజపంచకమనియూ, శేషం 6 వచ్చినచో చోరపంచకమని, శేషం 8 వచ్చినచో రోగపంచకమని తెలుసుకొనవలెనను. శేషము 3,5,7,9 వచ్చినచో ఆ ముహూర్తము పంచకరహితమైనది-శుభప్రదమనియూ గ్రహించవలెను.

## 3. మార్తాండ పంచకరహితం

**శ్లో॥ గతతిథి సమాయుక్తం తత్కాలోదయ మిశ్రితమ్।**
**నవభిస్తు హరేద్భాగం శేషం మార్తాండమీరితమ్॥**

గతించినతిథులను, తాత్కాలిక లగ్న సంఖ్యలను కలిపి 9చే భాగించగా శేషం 3,5,7,9 వచ్చినచో ఆ సుముహూర్తము మార్తాండ పంచకరహితమై-శుభ ప్రదమని గ్రహించవలెను.

## 4. ధృవక పంచకరహితం-2 వ పద్ధతి

**శ్లో॥ వసు శైల పురారంధ్ర గణ వేదార్క శైలయోః।**
**నాగాబ్ధి వసునేత్రాణాం మేషాద్యాదనుక్రమాత్॥**

ఈ పద్ధతి యందు ధృవకములు ఏమనిన; మేషమునకు-8, వృషభమునకు-7, మిధునమునకు-3, కర్కాటకమునకు-8, సింహమునకు-8, కన్యకు-4, తులకు-12, వృశ్చికమునకు-7, ధనస్సునకు-8, మకరమునకు-4, కుంభమునకు-8, మీనమునకు-2. లగ్న ధృవక సంఖ్యకు తత్కాల తిధి, వార, నక్షత్ర, లగ్న సంఖ్యలను కలిపి 9చే భాగించగా శేషం 1,2,4,6,8 వచ్చిన పంచకరహితం కాలేదని; 3,5,7,9 శేషం వచ్చినచో ధృవకపంచకరహితమైనది గ్రహించవలెను.

## జననమందు దుష్టకాల ఫల నిర్ణయము

తిథులు:- బహుళ చతుర్దశి మరియూ అమావాస్యా అశుభకరములు.

వివరణము:- అమావాస్యా అనునది సినీవాలీ, కుహూ, దర్శ అని మూడు విధములుగా ఉన్నది. ఈ అమావాస్య యొక్క 8 ఝాముల కాలములో మొదటి ఝాము సినీవాలీ. చివర 7,8 ఝాములు రెండూ కుహూ. మధ్యగల 5 ఝాములు దర్శ అని కొందరు అభిప్రాయపడుచున్నారు.

అమావాస్య యొక్క వృద్ధియందు మధ్యదినమందు గల 60 ఘడియల కాలము దర్శ. కృష్ణ చతుర్దశితో కూడిన అమావాస్య పూర్వకాలము సినీవాలీ. ప్రతిపత్తుతో కూడిన అమావాస్యా ఉత్తరకాలము కుహూ. అమావాస్యా క్షయ సమయమున అంతయూ దర్శ అనియూ మయూఖముద్వారా తెలియవచ్చుచున్నది.

విశేషము:- దర్శయందు జననమైనచో తల్లిదండ్రులకు దారిద్ర్యమును, సినీవాలీ యందైన మహాదోషము, అనగా ఆ కాలమునందు తన ఇంట ఆవు, ఏనుగు,

దాసి, కుక్క, పక్షి మొదలగునవి యేవి ప్రసవించిన తనకు ఇంద్రైశ్వర్యమున్ననూ నశింపజేయును. కుహూ యందైన సర్వదోషములు కలుగును. గాన గ్రహశాంతి గోముఖ ప్రసవ శాంతి వెంటనే చేయవలయును.

నక్షత్రములు:- చిత్ర-1,2 పాదములు, పుష్యమి-2,3 పాదములు, పూర్వాషాఢా-3, ఉత్తర-1, మఖ-1, రేవతి-2,3,4, అశ్వని-2,3 పాదములు అశుభప్రదములు. ఆశ్లేష నక్షత్రమందు స్త్రీ, పురుష శిశువులు ఎవరు జన్మించిననూ అత్తగారికి హాని కలుగును. జ్యేష్ఠా నక్షత్రమందు పురుష జననమైనచో అన్నగారికి, స్త్రీ అయిన భర్త అన్నగారికి హానిని కలుగును. మూలా-4 కులమునకు హానిని కలుగజేయును.

జ్యేష్ఠా నక్షత్రకాలమును పది భాగములు చేసిన 1వ భాగమున జననము, మాతామహికి, 2-మాతామహునికి, 3-మేనమామకు, 4-తల్లికి, 5-తనకు, 6-గోత్రస్థులకు, 7-ఉభయ కులములకు, 8-తన అన్న గారికి, 9-తన మామకు, 10-సర్వమునకు హానిని కలుగజేయును.

మూలా నక్షత్రకాలమును 15 భాగములు చేయుగా; 1-తండ్రికి, 2-పినతండ్రికి, 3-సోదరులకు, 4-పితామహికి, 5-తల్లికి, 6-పినతల్లికి, 7-మేనమామకు, 8-పెద్దమామకు, 9-మామకు, 10-పశువులకు, 11-దాసీజనములకు, 12-శిశువునకు, 13-సోదరులకు, 14-తోబుట్టువులకు, 15-జననీ జనకునకు, సర్వదాదోషకరము గాన శాంతిని వెంటనే చేయవలయును.

నక్షత్ర విశేషములు:- ఆశ్లేషా, జ్యేష్ఠ, మూలాది నక్షత్రములందు కొన్ని పాదముల యందు దోషము లేకున్ననూ, ఉగ్ర నక్షత్రములగుట చేత తప్పక నవగ్రహశాన్తిని చేయుట యుక్తముగా భావించవలెను.

ఉత్తర నక్షత్రమందు జన్మించిన రెండు మాసములు, పుష్యమి నక్షత్రమందున మూడు మాసములును, చిత్రా నక్షత్రమందు జన్మించిన ఆరు మాసములును, పూర్వాషాఢా యందైన యెనిమిది మాసములు, ఆశ్లేష యందైన తొమ్మిది మాసములు, జ్యేష్ఠా యందైన పదునైదు మాసములు, మూలా నక్షత్రమందైన ఎనిమిది సంవత్సరములు తండ్రి పుత్రదర్శనము మాని వేయవలెనని శాస్త్రములు చెప్పు చున్నవి. అవి ఈ కాలమున అసంభవము కావున శాస్త్రోక్తముగా నవగ్రహశాన్తి సర్వదా చేయతగినది.

యోగములు:- విష్కంభము, వ్యతీపాత్, శూలం, వజ్రం, అతిగండం, వ్యాఘాతం,

పరిఘార్వార్ధం, వైధృతి, గండం ఈ యోగములు అశుభదాయకములు.

కరణములు:- భద్ర(విష్టి) అశుభదాయకము.

## జననమున గండాంత దోషములు

ఇవి మూడు విధములుగా ఉన్నవి. 1. లగ్న గండాంతము, 2. తిథి గండాంతము, 3. నక్షత్ర గండాంతము.

1. లగ్న గన్డాంతము:- 12-1 లగ్నముల యొక్కయు 4-5 యొక్కయు, 8-9 యొక్కయు, సంధికాలములయందు(అర+అర) ఒక ఘడియ కాలము అశుభదాయకము.

2. తిథిగన్డాంతము:- 5-6 తిథుల యొక్కయు, 10-11 యొక్కయు, 15-1 యొక్కయు సంధికాలము(4+4) 8 ఘడియల కాలము అశుభదాయకము.

3. నక్షత్ర గన్డాంతము:- రేవతి-అశ్వనుల యొక్కయు, ఆశ్లేష-మఖ యొక్కయు, జ్యేష్ఠ-మూలల యొక్కయు సంధికాలము(2+2) 4ఘడియల కాలము అశుభదాయకము.

ఈ జ్యేష్ఠా-మూలల యొక్క సంధికాలమును అభుక్తమూలము అని శాస్త్రములు చెప్పుచున్నవి. ఈ సంధికాలవిషయమున (అర+అర) 1 ఘడియ అని బృహస్పతి తెలుపగా, (1+1)=2 ఘడియలు అని వశిష్ఠుడు తెల్పగా, (2+2)=4 ఘడియలు అని నారదుడు చెప్పగా, (4+4)=8 ఘడియలు అని కాలామృతకారుడు చెప్పెను.

విశేషములు:- సంక్రమణము, గ్రహణము, విషఘడియలు, రాహుకాలము, యమగండము, అవమా, త్రిద్యుస్పృక్, వై.ప్ర.వ్య..స్త్ర., వేధ, క్రాన్తి మొదలగు దుష్టకాలములందు జన్మించిన అశుభదాయకము.

విశేషములు:- యమల జననము, త్రిక ప్రసవము, ప్రసవ వైకృతి, వదంతజననము, మొదలగు వికృత ప్రసవాలు అశుభదాయకములు. ఇవి సామాన్య దోషములు.

స్త్రీ జననము:- మూలయందు మామగారికిని, ఆశ్లేషయందు అత్తగారికిని, జ్యేష్ఠ యందు భర్త అన్నగారికిని, విశాఖయందు భర్త తమ్మునికి హానిని కలుగజేయును. ఈ నక్షత్రములందు జనియించినచో యధాశాస్త్రముగా శాంతి చేయవలెను.

ఏకనక్షత్ర జనన దోషము:- తండ్రి, తల్లి, అన్న, మొదలగు వారి నక్షత్రమందు శిశుజననము అశుభదాయకము గాన యధాశాస్త్రముగా శాన్తి జరుపవలెను.

## శుభ శకునములు

సువాసినీ, వేశ్య, బ్రాహ్మణద్వయం, దండధరుడగు శూద్రుడు, మంగళ వాయిద్యము, ఫలములు, పుష్పములు, ఛత్రము, చామరము, అశ్వము, ఏనుగు, పూర్ణజలకుంభము, చెరుకు, అన్నము, పాలు, పెరుగు, మాంసము, పొగలేని అగ్ని, తేనె, చలువ వస్త్రములు, అక్షతలు, వీణ, మద్దెల, శంఖము, వధూవరులు, ఘంటానాదము, జయ శబ్దము, మంగళవస్తువులు అభిముఖముగా వచ్చిన, మృదు శీతల వాతము, కోడి, అనుకూలమగు, పశ్చాద్వాతము, కుక్క-నక్క మొదలగు వాని వామగమనము మొదలగునవి శుభ ఫలములనిచ్చును.

## అశుభశకునములు

కాషాయ వస్త్రధారి, విధవ, కట్టెలమోపు, పాము, కొత్తకుండ, నూనెకుండ, బిచ్చగాడు, కుంటికుక్క, ముక్కులేని వాడు, రోడి, అంధుడు, కుంటివాడు, రజస్వలా, ఒంటితుమ్ము, సకలించుట, వస్త్రాదికము జారి పడుట, దురుక్కులు వినుట, భుజించి పొమ్మనుట, ఒంటి బ్రాహ్మణుడు, నేను కూడా వచ్చెదననుట, ఈపూట వద్దనుట, ప్రధాన వస్తువులు మరచుట, వెతికిన దొరకకపోవుట, ఎదురుదెబ్బ తగులుట మొదలగునవి అశుభ ఫలములనిచ్చును.

## సుస్వప్నములు

మేడలు, పర్వతములు, ఫలవృక్షములు, రథము, గుర్రము, ఏనుగులను చూచుట, ఎక్కుట, ప్రభువు, బంగారము, ఎద్దు, ఆవు, పండ్లు, పూలు, గోక్షీరము, గోఘృతము, కన్య, వేశ్య, రత్నములు, ముత్యాలు, శంఖము, దేవతా విగ్రహములు, చందనము, పుణ్య స్థలములను చూచుట, పాలు, పెరుగు, నెయ్యి, తేనె, భక్ష్యములను భక్షించుట, పీతాంబరమును ధరించుట, ఆభరణములు ధరించుట, జయములను పొందుట మొదలగునవి శుభ ఫలములనిచ్చును.

## దుస్స్వప్నములు

సర్పము, దున్నపోతు, నూనె, ఆముదము, బురదలో దిగుట, సముద్రములో దిగుట, బండినుండి పడుట, మృతవార్తవినుట, ప్రలాపము చేయుట, ఖైదుపడుట, వైద్యునిచూచుట, విధవను చూచుట, క్షౌరము చేయించుకొనుట, ముండ్లపొదలో పడుట, తన గొంతుకు ఉరి వేసికొనుట, తన చేతిలోని ఫలములను ఇతరులు లాగికొనుట, తనను కొట్టుట, గాడిదను ఎక్కుట, దున్నపోతును ఎక్కుట, కాకిని చూచుట, మొదలగునవి దుష్ఫలితములనిచ్చును.

| రాహుకాలము | | | యమకంటక కాలము | |
|---|---|---|---|---|
| వారము | మొదలు | చివర | మొదలు | చివర |
| ఆదివారం | సా.4-30 | సా.6-00 | మ.12-0 | మ.1-30 |
| సోమవారం | ఉ.7-30 | ఉ.9-00 | ఉ.10-30 | మ.12-0 |
| మంగళవారం | మ.3-00 | సా.4-30 | ఉ.9-00 | ఉ.10-30 |
| బుధవారం | మ.12-0 | మ.1-30 | ఉ.7-30 | ఉ.9-00 |
| గురువారం | మ.1-30 | మ.3-00 | ఉ.6-00 | ఉ.7-30 |
| శుక్రవారం | ఉ.10-30 | మ.12-00 | మ.3-00 | సా.4-3 |
| శనివారం | ఉ.9-00 | ఉ.10-30 | మ.1-30 | మ.3-0 |

| గుళిక కాలము | | |
|---|---|---|
| వారము | మొదలు | చివర |
| ఆదివారం | మ.3-00 | సా.4-30 |
| సోమవారం | మ.1-30 | మ.3-00 |
| మంగళవారం | మ.12-0 | మ.1-30 |
| బుధవారం | ఉ.10-30 | మ.12-0 |
| గురువారం | ఉ.9-00 | ఉ.10-30 |
| శుక్రవారం | ఉ.7-30 | ఉ.9-00 |
| శనివారం | ఉ.6-00 | ఉ.7-30 |

సూచన:- ఉదయం ఘంటలు మొదలు కాలంకి ఘంటవంతున సాయంకాలం ఘంటల వరకు కాలములు ప్రతిదినము ఆ వారాధిపతి మొదలు రవి, కుజ, గురు, బుధ, శుక్ర, శని, చంద్ర, రాహువులు క్రమంగా కాలములకు అధిపతులు. పాప గ్రహాధిపత్య కాలములు, రాహుకాలములు శుభ కార్యములకు మిక్కిలి వర్జింపదగినవి.

## ప్రథమావర్తమున దుష్టవిషయాది నిర్ణయము

1. మాసములు:- చైత్రము, జ్యేష్ఠము, ఆషాఢము, భాద్రపదము, కార్తీకము, పుష్యము, ఈ ఆరు మాసాలు స్త్రీ ప్రథమ రజస్వల యైన అశుభదాయకము.

2. తిథులు:- ప్రతిపత్, చవితి, షష్ఠి, అష్టమి, నవమి, ద్వాదశి, చతుర్దశి, పూర్ణిమ, అమావాస్య, అవమా త్రిద్యుస్పృక్, ఈతిథులు అశుభప్రదములు.

3. నక్షత్రములు:- భరణి, కృత్తిక, పునర్వసు, ఆశ్లేష, మఖ, పూర్వఫల్గుణి, పూర్వాషాఢా, పూర్వాభాద్రా, విశాఖ, జ్యేష్ఠ, ఈ నక్షత్రములు అశుభప్రదములు. మరియు భర్తృ నక్షత్రము, తనకు నైధనతార, భర్తకు అష్టమ చంద్రుడు అశుభ ప్రదములు.

4. వారములు:- ఆదివారము, మంగళవారము, శనివారము, అశుభప్రదములు.

5. యోగములు:- విష్కంభము, గండము, అతిగండము, శూలము, వ్యాఘాతము, వజ్రము, పరిఘ పూర్వార్ధము, వ్యతీపాత్, వైధృతి ఈయోగములు అశుభప్రదములు.

6. కరణములు:- భద్ర (విష్టి) అశుభప్రదము.

7. లగ్నములు:- మేష, సింహ, వృశ్చిక, మకర, కుంభ లగ్నములు అశుభములు.

8. విశేషములు:- సంక్రమణము, గ్రహణము, సూర్యోదయ కాలము, సూర్యాస్తమయకాలము, అపరాహ్ణము, అర్ధరాత్రి, అపరరాత్రి, వర్జ్యకాలము, రాహుకాలము, యమగండకాలము, నిద్రాసమయము, రాత్రిసమయము, వ్య, ప్ర, వై, ప్ర, వేధలు, క్రాన్తులు మొదలగు కాలములు అశుభసమయములు.

9. వస్త్రములు:- నీలవస్త్రము, రక్తవస్త్రము, చిత్రవస్త్రము, దిగంబరత్వము అశుభదాయకములు.

10. స్థానములు:- పరగృహము, గ్రామాన్తరము, మార్గమధ్యము, అపవిత్రార్థములు అశుభప్రదములు.

11. సన్నివేశము:- సంమార్జనీ, కాష్టము, తృణము, అగ్ని, చేట, కత్తి, హస్తములో ధరించియున్న సన్నివేశములు అశుభప్రదములు.

12. బిందుఫలము:- వస్త్రమునందు ఒకటి రెండు బిందువులు శుభప్రదము. అనేక బిందువులు అశుభ ప్రదము. కొందరు బేసిబిందువులు శుభప్రదములు, పుత్రప్రదములు అని, సరిబిందువులు రోగప్రదములు పుత్రికాప్రదములు అనియు చెప్పుచున్నారు.

## ప్రధమావర్తమున శుభవిషయాది నిర్ణయము

అశ్విని, రోహిణి, మృగశిర, పుష్యమి, ఉత్తర, హస్త, చిత్ర, స్వాతి, విశాఖ, అనూరాధ, మూల, ఉత్తరాషాఢ, శ్రవణం, ధనిష్ఠ, శతభిషం, ఉత్తరాభాద్రా, రేవతి ఈ 17 నక్షత్రముల యందును సోమ, బుధ, గురు, శుక్రవారముల యందును, ఈ గ్రహముల యొక్క లగ్నముల యందును, ఆర్తవ లగ్నమునకు శుభగ్రహములు. 2,4,5,7,9,10,11 ఈ స్థానములందుండగాను, పాప గ్రహములు 3,6,11 స్థానముల యందుండగాను, చంద్రహోర యందును ప్రధమార్తవము జరిగెనేని సౌఖ్యము, సౌభాగ్యము, సంతానము, సంపద, ఆయుష్యము, అర్ధలాభము, ఆరోగ్యము, అనందము, ప్రియవాల్లభ్యము, యశస్సు మొదలగు శుభఫలములు లభించును.

## పురశ్శుక్ర దోషములు

గర్భిణీ స్త్రీ, శిశు సహిత స్త్రీ, నూతన వధువు వీరలు శుక్రుడు, తూర్పుదిక్కున ఉన్నప్పుడు పశ్చిమ దిక్కు నుండి వాయువ్య దిక్కునకు, ఉత్తరమునకు, ఈశాన్యమునకు, తూర్పు దిక్కునకు ప్రయాణము చేయ కూడదు.పశ్చిమ దిక్కున శుక్రుడున్నప్పుడు తూర్పుదిక్కునుండి ఆగ్నేయము, దక్షిణము, నైఋతి, పడమరలకు ప్రయాణము చేయకూడదు. ఏకగ్రామమందు ఈ దోషము లేదు. దుర్భిక్ష, రాజవిద్వర, వివాహ, తీర్ధయాత్రల లో ఈ దోషము వర్తింపదు.

## మరణ విషయమై దుష్ట నక్షత్రములు

మృగశిర–చిత్ర 2నెలలు, కృత్తిక–పునర్వసు–ఉత్తర–విశాఖ–ఉత్తరాషాఢ నక్షత్రములకు 3నెలలు, రోహిణి–మఖ నక్షత్రములకు 5నెలలు, ధనిష్ఠ–శతభిషం –పూర్వాభాద్రా–ఉత్తరాభాద్రా–రేవతి నక్షత్రములకు 6 నెలలు. పై నక్షత్రములందు మరణము సంభవించిన యెడల ఆయానక్షత్రమునకు ఏర్పడిన నెలలకాలము ఇంటిని విడువవలెను. శాంతిని చేయించి ఇంటిని తిరిగి చేరవలెను.

కొందరి మతమున, తల్లిదండ్రుల మరణ పై నక్షత్రాదులలో గలిగిననూ, ఇల్లు విడువ పనిలేదు. ఇది దేశాచారమననుసరించినది. ధనిష్ఠకు6, శతభిషమునకు

5, పూర్వాభాద్రకు 4, ఉత్తరాభాద్రకు 3, రేవతికి 2 మాసములు అని కొన్ని గ్రంథములలో గలదు.

## ఆశౌచ విషయము

ఆశౌచము; జాతాశౌచము, మృతాశౌచము, స్రావాశౌచము అని మూడు విధములుగా నున్నది. కూటస్థుని దగ్గరనుండి యేడుగురు పురుషుల వరకు, సపిండులు. తరువాత యేడుగురు పురుషుల వరకు (14) సమానోదకులు. తరువాత యేడుగురు పురుషుల వరకు (21) సగోత్రులు అని గ్రంథములు చెప్పుచున్నవి. మరియు సాపింద్యముపురుష జనన విషయములో సప్తపూరుషము–స్త్రీ జనన విషయములో త్రిపూరుషమనియు చెప్పుచున్నవి. ఈ సాపింద్యాదులను అనుసరించియే ఆశౌచము ప్రవర్తించుచున్నది.

## జాతాశౌచము

జననమందు జ్ఞాతులందరకు పదిదినములు జాతాశౌచము. గర్భస్రావము 4వ మాసమున జరిగినచో తండ్రికి మాత్రము స్నానము. 5,6 మాసములందు జరిగిన తండ్రికి, జ్ఞాతులకు స్నానము. 7,8,9 మాసములయందు జరిగిన అందరకు 10 దినములు ఆశౌచము.

తల్లికి, పురుష ప్రసవమునందు 30 దినములు, స్త్రీ ప్రసవమందు 40 దినములు ఆశౌచము అనంతరము శుద్ధియగును. దీనిని నెలపురుడు అందురు. 10 దినముల వరకు అనిరీక్ష్యత్వాది(చూడకుండుట) రూపమగు ఆశౌచము. అనంతరము అస్పృశ్యత(తాకకుండుట) కర్మానర్హత్వ(కర్మలకు పనికిరాకుండుట) రూపమగు ఆశౌచము. కుమార్తె మొదట ప్రసవించిన సందర్భమున, పుత్ర జననమైతే ఆ కుమార్తె యొక్క తల్లిదండ్రులకు 3దినములు జాతాశౌచము.

## మృతాశౌచము

జననము మొదలు 10దినములలోగా శిశువు మరణించినచో తండ్రికి జ్ఞాతులకు అందరకు జాతాశౌచ శేషముతో శుద్ధి యగును. మృతాశౌచము లేదు.

పదిదినములకు పైన 6 మాసములకు లోగా మరణించినచో, జ్ఞాతులకు

స్నానమాత్రము. 6మాసములకు పైన 3 సంవత్సరములకు లోగా శిశువు మరణించినచో తల్లిదండ్రులకు, జ్ఞాతులకు, బాలమరణమున 1దినమును, బాలికామరణమున సద్యో అశౌచము.

3 సంవత్సరములకు పైన ఉపనయనమగు వరకు జ్ఞాతులకు త్రిరాత్రము ఆశౌచము. ఉపనయన అనంతరము వటువు మరణించిన, తల్లిదండ్రులకు, భ్రాతలకు అందరు జ్ఞాతులకు దశరాత్రము ఆశౌచము.

3 సంవత్సరములకు పైన వివాహములోపల బాలికా మరణమునందు తల్లిదండ్రులకు, భ్రాతలకు దశరాత్రాశౌచము. జ్ఞాతులకు దినము ఆశౌచము.

దశరాత్రాశౌచము: జ్ఞాతి (సపిండుని) మరణమునందు జ్ఞాతులకు దశరాత్రాశౌచము.

త్రిరాత్రాశౌచము శిశు జననమందును, ఉపవీతుని మరణమందును సమానోదకులకు మూడు దినములు ఆశౌచము, సగోత్రులకు అహస్సు ఆశౌచము, అనుపనీతుని మరణమునందు స్నానమాత్రము. (సపిండుడు సమానోదకుడు సగోత్రుడు మొదట వివరించబడియున్నారు.)

## ఆశౌచవిషయములో ప్రమాణము

**శ్లో॥ దశాహేన సపిండానాం శుద్ధిస్స్యాతు త్రిరాత్రతః।**
**సమానోదక జాతానాం గోత్రాజానా మహస్స్మృతమ్॥**

భగినీపుత్ర (తోబుట్టువుని కుమారుని) మరణమందు తల్లి తోబుట్టువులకు, తల్లి సోదరులకు త్రిరాత్రము. పరోక్షమున పక్షిణి, అనుపనీత మరణమందు స్నాన మాత్రము. పినతల్లి అనూధ అయిన మేనమామ అనుపనీతుడైన స్నానమాత్రము.

మాతామహి మాతామహుల యొక్క మరణమందు దౌహిత్రునకు త్రిరాత్రము పక్షిణి. అత్త,మామల మరణమందు అల్లునకు తన భార్య జీవించియున్న త్రిరాత్రము. పక్షిణ్యాశౌచము.

### వివాహితయగు స్త్రీకి

1.తల్లి తండ్రి 2.తల్లి తల్లి 3. మేనమామ 4.ఆయన కొడుకు 5. కూతురు 6. తల్లి తోబుట్టువు 7. ఆమె కొడుకు 8. కూతురు 9. తన తోబుట్టువు 10. ఆమె కొడుకు 11. కూతురు 12. తనతో బుట్టినవాడు 13. ఆయన కొడుకు 14. కూతురు

15. తండ్రితోబుట్టువు 16. ఆమెకొడుకు 17. కూతురు 18. తండ్రితోబుట్టినవాడు 19. ఆయన కొడుకు 20. కూతురు 21. కొడుకు కూతురు 22. కూతురి కూతురు 23. తండ్రి తండ్రి 24. తండ్రి తల్లి

ఈ పై తెలిపిన 24 మంది యొక్క మరణమందు వివాహి స్త్రీకి పక్షిణి ఆశౌచము సంభవించును.

## పురుషునకు

1. మేనమామ కొడుకు 2.కూతురు 3. తల్లితోబుట్టువు కొడుకు 4. కూతురు 5. తండ్రి తోబుట్టువు కొడుకు 6. కూతురు 7. తనతోబుట్టువు. 8. ఆమె కొడుకు 9. కూతురు 10. తన సోదరుని కూతురు 11. తండ్రి సోదరుని కూతురు 12. కుమారుని కూతురు 13. కూతురి కూతురు.

ఈ పై తెలిపిన 13 మరణములందు పురుషునకు పక్షిణి ఆశౌచము సంభవించును. ఈ పక్షిణి ఆశౌచము వివాహితలగు స్త్రీల యొక్కయు , ఉపనీతులగు పురుషులయొక్కయు మరణమునందే సంభవించును. అంతకు పూర్వమైన స్నానము చేతనే శుద్ధియగును. పక్షిణి యనగా ఆశౌచము విన్న పగలు భాగము, ఆ రాత్రిభాగము, మరుదినము పగలు 3 భాగములు కలసిన పక్షిణి అనబడును. రాత్రి విన్ననూ ఇటులనే రాత్రి, పగలు, రాత్రి3 భాగములు పక్షిణి అనబడును. (పక్షిణి అనగా 90 ఘడియల కాలము).

## ఏక దినాశౌచము

సవతి కూతురు యొక్క మరణమునందు సవతి తల్లికి, సవతి తల్లి యొక్క మరణమందు సవతి కూతురునకు, ఏకదినము, భిన్నోదరమాతుల మరణము నందు ఒక దినము రాజు యొక్క మరణము నందు సన్నిధానమున ఒక దినము. అతిక్రాంతాశౌచము.

జనన విషయములో అతిక్రాన్తాశౌచము లేదు అని చెప్పబడినది. మరణ విషయములో దశాశౌచము కలవారికి 10 దినములు అతిక్రమించిన తరువాత స్నానమాత్రము. త్రిరాత్రాశౌచము అతి క్రమించిన యెడల ఒకదినము ఆశౌచము. ఏకదినాశౌచము అతిక్రమించిన యెడల స్నానమాత్రం. పక్షిణ్యాశౌచము అతిక్రమించిన యెడల దశాహమధ్యమందైన ఏకకాలము, అనగా పగలు విన్న పగలు, రాత్రి విన్న రాత్రి ఆశౌచము, దశాహానంతరమందైన స్నానమాత్రము.

## ఆశౌచ సాంకర్యము నందు

జాతాశౌచకాలములో సమాన పరిణామము గల మరియొక జాతాశౌచము వచ్చిన యెడల అది పూర్వాశౌచ శేషముతోడనే శుద్ధియగును.

మృతాశౌచ కాలములో సమ పరిమాణము గల మృతాశౌచము కాని జాతాశౌచముగాని వచ్చిన యెడల ఆ రెండును పూర్వాశౌచము శేషము తోడనే శుద్ధియగును.

## ఆశౌచ కాల నిర్ణయము

ఋతువు, జననము, మరణము రాత్రికాలము జరిగిన నిర్ణయ మార్గము: సంధ్యాకాల వ్యతిరిక్త మగు రాత్రిని అనగా త్రియామను (రాత్రిని) మూడు భాగములు చేసి మొదటి 1-2 భాగములు పూర్వదిన మునకు చెందినవిగాను చివర మూడవ భాగము పరదినమునకు చెందినదిగాను నిర్ణయింపదగియున్నది.

## ప్రయాణ దిశా శూలవిషయము

### నక్షత్రము

శ్లో॥ పూర్వే జ్యేష్ఠాధనిష్ఠే చశ్రోణాశ్వన్యౌ చదక్షిణే।
పశ్చిమే పుష్యరోహిణ్యా వుత్తరే హస్త ఫల్గుణీ।
ఏతన్న క్షత్ర శూలా సుయాత్రా న పునరాగమమ్॥

తా॥ జ్యేష్ఠ ధనిష్ఠ తూర్పు దిక్కునకును, శ్రవణాశ్వనులు దక్షిణ దిక్కునకును, పుష్యమీ రోహిణులు పశ్చిమ దిక్కునకును, హస్త పుబ్బ ఉత్తరలు ఉత్తర దిక్కునకును శూల సంజ్ఞలు గలవి. కనుక ఈ నక్షత్ర శూలలో ప్రయాణము చేసిన వారు తిరిగిరారు. అని తాత్పర్యము.

శ్లో॥ నక్షత్ర శూలాశాంత్యర్థం దధి తైలం గుడం తథా।
పాయసంచ ప్రదాతవ్యం దిక్షు ప్రాగాదిషుక్రమాత్॥

తా॥ తూర్పు దిక్కునందు శూలలు గల నక్షత్రములకు పెరుగును, దక్షిణ దిక్కునందు శూలలు గల నక్షత్రములకు తైలమును, పశ్చిమ దిక్కునందు శూలలు గల నక్షత్రములకు బెల్లమును, ఉత్తర దిక్కునందు శూలలు గల నక్షత్రములకు క్షీరాన్నమును దానము చేయవలెను.

## తిథి

శ్లో॥ ద్వితీయా చ తృతీయాచ పంచమీ సప్తమీ తథా।
దశ్యమ్యేకాదశీచైవ యాత్రా సిద్ధిం త్రయోదశీ॥
కృష్ణేవా యది వా శుక్లే వర్జనీయా చతుర్దశీ।
పౌర్ణమాస్యామమాయాం చన గంతవ్యం కదాచన॥

తా॥ కృష్ణ పక్షమునందును, శుక్లపక్షము నందును విదియ, తదియ, పంచమీ, సప్తమీ, దశమీ, ఏకాదశీ, త్రయోదశీ అను ఈ తిథులు కార్యసిద్ధిని గలిగించును. శుక్ల, కృష్ణ పక్షములయందు చతుర్దశిని విడువవలెను. పూర్ణిమ, అమావాస్యా తిథులలో ఎప్పుడును ప్రయాణము చేయరాదు.

## కాలసమీక్ష

ఉషఃకాలము ప్రయాణమునకు శుభదాయకము. ఉషఃకాలము అనగా సూర్యోదయమునకు పూర్వ ముహూర్తము, శన్యుషః కాలము ప్రయాణమునకు ముఖ్యతమము అని గర్గమహర్షి మతము.

ప్రయాణము చేయువారు శకునమును చూచి కార్యసిద్ధిని నిర్ణయించుకొని ప్రయాణము చేయ వలయును. గాన శుభ శకున కాలమే ప్రయాణకాలము అని బృహస్పతి మతము. **"జగామలంకాం మనసా మనస్వీ"**అను హనుమ ధ్యానన్యాయముచే కార్యసిద్ధిత్వరాభినేశము గల మానసిక వేగము కల కాలమే ప్రయాణ కాలము అని మాండవ్య మతము.

**శ్లో॥ నమోస్తు రామాయ స లక్ష్మణాయ। దేవ్యైచ తస్యై జనకాత్మజాయై।
నమోస్తు రుద్రేంద్ర యమానిలేభ్యః। నమోస్తు చంద్రార్క మరుద్గణేభ్యః॥**

అని కార్యసిద్ధిసాధక దేవతా ధ్యానకాలమే ప్రయాణ శుభకాలము అని సంప్రదాయవేత్తలు చెప్పుచున్నారు.

**శ్లో॥ న తిథిర్నచ నక్షత్రం న యోగం కరణం తథా।
న హెూరా యోగినీ చక్రం న లగ్నం న తమోగుణః॥
వ్యతీపాతే చ సంక్రాన్తౌ భద్రాయామశుభేదినే।
దేవదేవార్చనం కృత్వాసర్వత్ర విజయీభవేత్॥**

## వాస్తుపురుష స్థితి

భాద్రపద, ఆశ్వయుజ, కార్తీక మాసములందు తూర్పు శిరస్సు కలిగి ఎడమప్రక్కను శయనించును గాన ఈ మాసములందు పశ్చిమ సింహద్వారము, దక్షిణ సింహద్వారము గల గృహములకు శంకుస్థాపన చేయవలెను. మార్గశిర, పుష్య, మాఘ మాసములందు దక్షిణ శిరస్సుగా శయనించును. ఈ మాసములందు పడమర సింహద్వారము, ఉత్తరసింహద్వారము గల గృహములకు శంకుస్థాపన చేయవలెను. ఫాల్గుణ, చైత్ర, వైశాఖమాసములందు పశ్చిమశిరస్సుగా శయనించును. ఇందు తూర్పుసింహద్వారము, ఉత్తరసింహద్వారం గల గృహములకు శంకుస్థాపన చేయవలెను. జ్యేష్ట, ఆషాఢ, శ్రావణ మాసములందు ఉత్తర శిరస్సుగా శయనించును. ఇందు దక్షిణ సింహద్వారము, తూర్పు సింహద్వారము గల వాటికి శంకుస్థాపన చేయాలి. వాస్తు పురుషునికి గల దృష్టికి అభిముఖ సింహద్వార గృహములకు పాదములకు అభిముఖ సింహద్వార గృహములకు ఆయా మాసములందు శంకుస్థాపన చేయరాదు. ఇదియే బహుదేశాచార సిద్ధమున్నూ, వశిష్ఠ, నారద సంహితాది మూల గ్రంథ ప్రమాణ సిద్ధమున్నూ అయి ఉన్నది. ఇది త్రైమాసిక వాస్తు పురుష స్థితి.

## క్షణిక వాస్తు నిర్ణయము

వాస్తు పురుషుడు ప్రతిదినమునందును పగలు మొదటి జామునను, రాత్రి మొదటి జామునను ఉత్తర శిరస్సు తూర్పునకు దృష్టియు కలిగి శయనించును. గావున 1 జామున తూర్పునకు సింహద్వారము దక్షిణమునకు సింహద్వారము గల వాటికి శంకుస్థాపన చేయవలెను. 2 జామున తూర్పు శిరస్సు దక్షిణ దృష్టి గలిగియుండును. గావున 2 జామునదక్షిణ సింహద్వారము పశ్చిమ సింహద్వారము గల గృహములకు శంకుస్థాపన చేయవలెను. ఆరవ జామున దక్షిణ శిరస్సు పడమర దృష్టి గలిగియుండును. 3 జామున పశ్చిమ సింహ ద్వారము ఉత్తర సింహద్వారము గల వాటికి శంకుస్థాపన చేయవలెను. 4వ జామున పడమరకు శిరస్సు, ఉత్తరమునకు దృష్టియు గలిగియుండును. గావున

4 జామున తూర్పు సింహద్వారము ఉత్తర సింహద్వారము గల వాటికి శంకుస్థాపన చేయవలెను. పైన చెప్పబడిన త్రైమాసిక వాస్తు పురుష స్థితిని బట్టి గృహమునకు శంకుస్థాపన చేయుకాలము లభించని సమయమున ఈ క్షణిక వాస్తు (యామ) నిర్ణయమును అనుసరించి గృహములను నిర్మించుటయు ఆచారసిద్ధము అయి ఉన్నది. మరియు నాలుగు వైపులకు సింహద్వారములు గల చతుశ్శాలా (మండువా) లోగిలికి శంకుస్థాపనను అన్ని మాసములందును చేయవచ్చును.

## దేవాలయారంభము

ఉత్తరాయణము-చైత్ర, వైశాఖ, జ్యేష్ఠ, ఫాల్గుణమాసములు ఉత్తమము. శ్రావణ, కార్తీకమాసములు మధ్యమము శుక్లపక్షము ఉత్తమము, అన్యపంచకమును వదిలిన కృష్ణపక్షము మంచిది. సోమ, గురు, శుక్ర , బుధ వారములు ప్రశస్తములు. రోహిణి, పునర్వసు, ఉత్తర, హస్త, స్వాతి, అనూరాధా, శ్రవణము, శతభిషం ఈ నక్షత్రములు ఉత్తమములు. స్థిరలగ్నము ముఖ్యము. పాపులు 3-6-11 రాశులయందును శుభులు. కేంద్ర త్రికోణమునందును ఉండగా స్థిర లగ్నమున ప్రారంభించుట ఉత్తమోత్తమము.

## దేవాలయ ప్రతిష్ఠ

ఉత్తరాయణము- చైత్రము, వైశాఖము, జ్యేష్ఠము, మాఘ, ఫాల్గుణ మాసములు ఉత్తమము. శ్రావణ, ఆశ్వయుజ, కార్తీక మాసములు మధ్యమము. మార్గశీర్ష మాసము పనికిరానిది. అశ్వని, రోహిణి, పునర్వసు, పుష్యమి, ఉత్తర, హస్త, చిత్ర, స్వాతి, అనూరాధా, శ్రవణము ఈ పది నక్షత్రములు , శుక్ల పక్షము- సోమ, బుధ, గురు, శుక్ర వారములు ప్రశస్తములు. స్థిర లగ్నము ఉత్తమము చరలగ్నము పనికిరాదు. శుభులు కేంద్ర త్రికోణముల యందును పాపులు త్రిషడాయములయందును ఉండగా స్థిరలగ్నమున దేవాలయమునందు పరమేశ్వరార్చా రూపమును ప్రతిష్ఠించుట ఉత్తమోత్తమము. విశేషమేమనగా;

**శ్లో॥ మాతృ భైరవ వరాహ నారసింహ త్రివిక్రమాః।**
**మహిషాసుర హంత్రీ చ స్థాప్యావై దక్షిణాయనే॥**

## గృహారంభము

ఉత్తరాయణము చైత్రము, వైశాఖము, కార్తీకము, మాఘము, ఈ మాసములు శుక్ల పక్షమున 2,3,5,7,10,13 తిథులు ప్రశస్తము. కృష్ణపక్షమున చివర పంచకము పనికిరాదు. మిగతా 1,2,3,5 తిథులు పనికి వచ్చును. అవమా, త్రిద్యుస్పృక్ మొదలగు దుష్టతిథులు మంచివికావు. రోహిణీ, మృగశిర, ఉత్తర, హస్త, చిత్త, జ్యేష్ట, ఉత్తరాషాఢా, శ్రవణం ఈ నక్షత్రములు ప్రశస్తములు. అశ్విని, పుష్యమి, స్వాతి, అనూరాధా, శతభిషం, ఉత్తరాభాద్రా, రేవతి ఈ ఏడు నక్షత్రములు మధ్యమములు. ఇతర నక్షత్రములు మంచివి కావు. బుధ, గురు, శుక్రవారములు పూర్ణేందు వారము ప్రశస్తము. పరిఘ, వైధృతి, వ్యతీపాత్, గండం, అతిగండం, వ్యాఘాతం ఈ యోగములు మంచివి కావు. భద్రకరణము మంచిది కాదు. స్థిర లగ్నము, ద్విస్వభావ లగ్నములు మంచివి.

వృషభ లగ్నము ప్రశస్తమైనది. అష్టమశుద్ధి ఉండవలెను. కేంద్రత్రికోణముల యందు పాపులు ఉండకూడదు. శుభగ్రహములు కేంద్ర త్రికోణములండున్నఉ పాపులు 3,6,11, రాశుల యందున్నఉ శుభప్రదం గురు, శుక్రుల యొక్క మౌఢ్యము, బాల్యము, వార్ధక్యము, చాతుర్మాస్యకాలము, శూన్యమాసము మంచివి కావు.

## గృహప్రవేశములు

ఉత్తరాయణము - మాఘ, ఫాల్గుణ, వైశాఖ, జ్యేష్ఠ మాసములు ప్రశస్తము. కుంభమాసము మంచిది కాదు. శుక్లపక్షము 2,3,5,7,10,13 తిథులు, కృష్ణపక్షమున చివర పంచకముగాక 1,2,3,5 తిథులు మంచివి. అవమా,త్రిద్యుస్పృక్ మొదలగు దుష్టతిథులు పనికిరావు. బుధ, గురు, శుక్రవారములు పూర్ణేందువారము మంచివి. రోహిణి, మృగశిర, ఉత్తర, చిత్త,అనూరాధా, ఉత్తరాషాఢా, శతభిషం, ఉత్తరా భాద్రా, రేవతి ఈ నక్షత్రములు ప్రశస్తములు. అశ్విని, పునర్వసు, హస్త, స్వాతి, శ్రవణం ఈ నక్షత్రముల యందు గృహ మున ప్రవేశించిన కొలది కాలములోనే అన్యాక్రాంతమగు శేషించిన నక్షత్రములు మంచివి కానేరవు. పరిఘాది యోగములు, భద్రకరణము మంచివి కావు. జన్మరాశియందు గృహప్రవేశము శుభప్రదము. గురు, శుక్రుల యొక్క

మౌఢ్యము, బాల్యము, వార్ధక్యము, చాతుర్మాస్యకాలము, శూన్యమాసము మంచివి కావు. స్థిర లగ్నములు, ద్విస్వభావ లగ్నములు మంచివి. వృషభలగ్నము ప్రశస్తమైనది. ద్వాదశ శుద్ధి యుండవలెను. కేంద్ర త్రికోణములయందు పాపులు ఉండకూడదు. శుభులు కేంద్రకోణముల యందున్ననూ పాపులు 3,6,11 రాశు లయందున్ననూ ప్రశస్తమైనది. చంద్రబలము గృహప్రవేశమునకు ముఖ్యముగా చూడతగినది. కలశ, వృషభములయొక్క ఫలములను గూడా చూడవలెను.

## కలశ చక్రము యొక్క ఫలము

కలశచక్రమును లిఖించి రవియున్న నక్షత్రము మొదలు 27 నక్షత్రములు కలశము యొక్క పార్శ్వాది భాగములయందు వ్రాసి చంద్రుడున్న సుముహూర్త కాలిక నక్షత్రము ఎచటనున్నదో తెలుసుకొని లెక్కించిఫలము చెప్పబడుచున్నది. దాని పరమార్థము ఈ క్రింద వివరింపబడుచున్నది. రవి యున్న నక్షత్రము మొదటిగా వ్రాయదగియున్నది. చంద్రుడున్న నక్షత్రమును తెలుసుకొని ఫలమును గుర్తింపుము.

## కలశచక్రము యొక్క ఫలములు

| నక్షత్రములు | ఫలము |
|---|---|
| 1. | శిరచ్ఛేదము |
| 2,3,4,5 | పరదేశగమనము |
| 6,7,8,9 | నిర్భయము |
| 10,11,12,13 | ధాన్యము |
| 14,15,16,17 | దారిద్ర్యము |
| 18,19,20,21 | గర్భస్రావము |
| 22,23,24 | సంపద |
| 25,26,27 | పశువృద్ధి |

## వృషభచక్రము యొక్క ఫలము

వృషభచక్రమును లిఖించి సూర్యుడున్న నక్షత్రము మొదలు అభిజిత్తుతో సహా 28 నక్షత్రములుగా నిర్ణయించి వృషభావయవములందు వ్రాసి వృషభచక్రము లిఖించి అప్పుడు సుముహూర్తకాలికమగు చంద్రుడున్న నక్షత్రమెచ్చట నున్నదో కనుగొని లెక్కించి ఆ అవయవములననుసరించి ఫలము చెప్పబడు చున్నది. దాని పరమార్ధము ఈ క్రింద వివరింపబడు చున్నది. రవి నక్షత్రము మొదటిగా వ్రాయదగి యున్నది. చంద్రుడున్న నక్షత్రమును తెలుసుకొని ఫలమును గుర్తింపుము.

| నక్షత్రములు | ఫలము |
|---|---|
| 1,2,3 | మృత్యువు |
| 4,5,6,7 | దురవస్థ |
| 8,9,10,11 | చిరకాలస్థైర్యం |
| 12,13,14 | దేశభ్రమణము |
| 15,16,17,18 | ధనము |
| 23,24,25 | సంపద |
| 26,27,28 | పశువృద్ధి |

## గృహములు కట్టరాని ప్రదేశములు

శక్తికి పార్శ్వముననను రుద్రునకు దృష్టి ప్రదేశముననను, విష్ణువునకు పృష్ఠభాగముననను ఇండ్లు కట్టరాదు. రాజవీధి మధ్య అడ్డముగా నున్ననూ కట్టవచ్చును అని కొందరి మతము. గోవులు మంద వేయు స్థలము, స్మశాన భూమి, మరుభూమి, మలత్యాగము చేయు స్థలము, చెరువులు, బావులు పూడ్చిన స్థలములందును ఇండ్లు కట్టరాదు. క్రమముగా వంశమునకు లోపము తటస్థించును. దాయాదుల గృహముల గర్భ, వేమ, పోటీలు కూడదని బహు శాస్త్రములందు కలదు.

## గృహములో తేనెపట్టు పెట్టినందుకు ఫలము

ఇంటిలో తేనెపట్టు మధ్యభాగమును పెట్టిన యజమానునకు మరణము, తూర్పున ధనలాభము,

# నవగ్రహ శాన్తి విషయము

సూర్యగ్రహమునకు:- యథావిధిగా పూజించి, సూర్యనమస్కారములు చేసిననూ, ఎఱ్ఱపూవులచే పూజించిననూ, ఎఱ్ఱగుడ్డ మాణిక్యము ధరించిననూ, ఎఱ్ఱ ఆవు లేక గోధుమ దానము చేసిననూ దోషనివృత్తి అగును.

చంద్రగ్రహమునకు:- యథావిధిగా పూజించి శ్వేత పుష్పములచే పూజించిననూ, శ్వేత వస్త్రము, ముత్యములు ధరించిననూ, శంఖము లేక బియ్యము, వీటిని దానము చేసిననూ దోషనివృత్తి అగును.

కుజగ్రహమునకు:- యథావిధిగా పూజించి రక్తవస్త్రము, పగడములు ధరించిననూ, సువర్ణము లేక కందులు దానము చేసిననూ, దోషనివృత్తి అగును.

బుధగ్రహమునకు:- యథావిధిగా పూజించి, పీతాంబరము, మరకతము ధరించిననూ, సువర్ణము లేక పెసలు దానము చేసిననూ దోషనివృత్తి అగును.

గురుగ్రహము:- యథావిధిగా పూజించి, పుష్యరాగము, పసుపు వస్త్రము ధరించిననూ, లేక శనగలు దానము చేసిననూ దోషనివృత్తి అగును.

శుక్రగ్రహము:- యథావిధిగా పూజించి, శ్వేతవస్త్రము, వజ్రము ధరించిననూ, వెండి, తెల్లటి గుఱ్ఱము, అనుములు దానము చేసిననూ దోషనివృత్తి అగును.

శని గ్రహము:- యథావిధిగా పూజించి, కపిలవస్త్రము, ఇన్ద్రనీలము ధరించిననూ, ఇనుము, మహిష, నువ్వులు దానము చేసిననూ దోషనివృత్తి అగును.

రాహుగ్రహము:- యథావిధిగా పూజించి గోమేధికమును ధరించిననూ, కత్తి లేక ఇనుమువుద్దులు(మినుములు) దానముచేసిననూ, దోషనివృత్తి అగును.

కేతుగ్రహము:- యథావిధిగా పూజించి వైఢూర్యము ధరించిననూ, దానము చేసిననూ, వులవలు దానము చేసిననూ దోషనివృత్తి అగును.

మహారాజుల యొక్క ఔన్నత్యములు పతనములు సైతం నవగ్రహాధీనములై ఉన్నవి. నవగ్రహములు, తమను పూజించిన వారిని పూజించెదరు. అవమానించిన వారిని దహించెదరు. గాన మానవుల యొక్క లోకయాత్ర నవగ్రహాయత్తమగుటచే ఆత్మ విరోధము సంభవించిన సమయమునందైననూ, నవగ్రహములకు యథావిధిగా మనోవాక్కాయములచే పూజించుట ముఖ్య కర్తవ్యముగా శస్త్రమున అగుపడుచున్నది.

## సుముహూర్తములు

దైవజ్ఞులు శుభకార్యములందు శాస్త్రానుసారముగా తిథి వార నక్షత్ర యోగ కరణ శుద్ధులను, సమయశుద్ధిని లగ్నశుద్ధిని పంచక రాహిత్యమును తారాబల చంద్రబల సంపదలను లగ్న గుణములను సంపాదించి స్వల్ప దోషములను మహాదోషములను తొలగించి శుభలగ్నమును ఏర్పరచి ఆ లగ్నములో 3 లేక 1 నిమిషముల పరిమితి గల పుష్కరకాలమును సుముహూర్తముగా నిశ్చయించుచున్నారు ఇదియే సుముహూర్తము.

## లగ్నగుణములు

గురుశుక్రాదులలో ఒకరుఐననూ లగ్నమునకు కేంద్రకోణ ఉచ్ఛ స్థాన మిత్ర క్షేత్రములలోనున్నచో శుభగుణము. రవి, శని, కుజాదులు శుభ స్థానములందున్ననూ గుణము. ఇటులనే గుణములను తెలియదగినది. ఉపనయన లగ్నమున రవియున్న స్ఫుజిత దోషము వటువు తండ్రిని హరించును. కుజుడున్న కూజిత దోషము, తల్లిని హరించును. శనియున్న రుధిరదోషము, ఉపనీతుని కులమును హరించును. రాహువున్న ఉగ్రదోషము, వటువును హరించును. 1న కేతువున్న రంధ్రదోషము తండ్రిని హరించును. ఇట్టి దోషములు లేక లగ్న గుణసంపద కలిగి మహాదోష శూన్యమగు ముహూర్తమగు ముహూర్తమును నిశ్చయించుట దైవజ్ఞుని పూర్ణ విజ్ఞాన సాధ్యమై చిరకాల సాధ్యముగా తెలియవలెను.

## ఏకవింశతి మహాదోషములు

1. పంచాంగ శుద్ధి
2. సంక్రాంతిదోషము ం
3. పాపిషడ్వర్గదోషము
4. కునవాంశదోషము
5. కుజాష్టమదోషము
6. భృగుషట్కదోషము
7. కర్తరీదోషము
8. అష్టమలగ్న దోషము
9. అష్టమచంద్రదోషము
10. షడష్టరిష్ఫచంద్రదోషము
11. సగ్రహచంద్రదోషము
12. దుర్ముహూర్తదోషము
13. ఖార్జూరస్థసమాంఘ్రిభదోషము
14. గ్రహణభదోషము
15. ఉత్పాతదోషము
16. క్రూరయుగ్మదోషము
17. అశుభవిద్ధభదోషము.
18. విషయుగ్లగ్నదోషము
19. లగ్నాన్తదోషము
20. గన్డాన్తదోషము.
21. వ్యతీపాతవైధృతిమహాదోషము

## లగ్నపుష్కర కాలములు

**శ్లో॥ ఏకవింశో మనుశ్చైవ జినాశ్చమునయః క్రమాత్।**
**మేషాది మీన పర్యంతం పుష్కరాంశాః ప్రకీర్తితాః॥**

## శాస్త్రప్రబోధము

విహాహాది శుభలగ్నముల యందు ఏకవింశతి మహాదోషాది రిక్తములగు స్వల్పదోషములను లగ్నగుణములను శాస్త్రముచే నిర్ణయించి దోషాధిక్యము లేక గుణాధిక్యము గల లగ్నమును గ్రహించవలెను. లగ్నమందు సర్వదోషములు నివృత్తి చేయుటకు సృష్టికర్తయే సమర్ధుడు కానేరడు. అందుచే దోషశూన్య లగ్నము మృగ్యమని భావము.

## నవగ్రహములు 12 రాశులలో ఉండగా ఇచ్చే గోచార ఫలములు

ఏగ్రహమైనా 1,6,11లలో ఉంటే స్వర్ణమూర్తి శుభాన్నిస్తాయి.
2,5,9 లలో ఉంటే రజితమూర్తి 3,4 శుభం కల్గిస్తారు.
3,7,10లలో ఉంటే తామ్రమూర్తి 1.4 శుభం కల్గిస్తారు.
4,8,12 లలో ఉంటే లోహమూర్తి సంపూర్ణ కష్టకారకం.

## ఉపసంహారము

కనురెప్పపాటు కాలములో కోట్యంశకాలము లగ్నములో శుభకాలము. ఇది చిత్ర విచిత్రనిర్మాణ చతురుండగు విధాతకు గూడా తెలియసాధ్యము గాదు. ఇట్టి సూక్ష్మకాలమును మానవుడెట్లు తెలియగలడు. జన్మాంతరీయాదృష్టము వలననే అతిసూక్ష్మమగు శుభకాలము సంప్రాప్తమగును. అది దైవాధీనము. దైవజ్ఞుడు లగ్నమునకు సాక్షిమాత్రుడే కాని లగ్న ప్రదాత కానేరడు. అందువలన అఖిల చరాచర సృష్టికర్తయు ఆశ్రిత వాత్సల్యైక జలధియునైన శ్రీ విజయ దుర్గాదేవి అనుగ్రహము మీద ఆధారపడియున్న ఆ సుముహూర్తకాలమును పొందుటకు మానవుడు ఆమహాదేవి యొక్క అనుగ్రహమునకు ఎతురు చూచుటయే ముఖ్య కర్తవ్యమని సమయవేత్తలు వక్కాణించుచున్నారు.

శ్రీ విజయదుర్గాంబా దివ్య చరణారవిన్దార్పణమస్తు

## గోచార రీత్యా సూర్యుడు ఇచ్చే ఫలములు

1. గోచార రీత్యా రవి 1వ స్థానంలో ఉన్నచో, స్థానచలనము, రోగము, వేళకానివేళ భోజనం, అభివృద్ధి క్షీణత, కలహం.

2. లగ్నాత్ 2స్థానంలో ఉన్నచో, ఆదాయ క్షీణత, ఖర్చులెక్కువ, నేత్రశిరోరోగం, మోసం, ధననష్టం.

3. 3స్థానంలో ఉన్నచో, ఆరోగ్యం, అధికాదాయం, బంధుమిత్రదర్శనం, మానసికానందం, సుఖం, ఇష్టసిద్ధి.

4. 4స్థానంలో ఉన్నచో, రోగం, చేసేపనులు కలసిరావు. విచారము, ఆందోళన, గృహచ్ఛిద్రాలు.

5. 5స్థానంలో ఉన్నచో, శతృభీతి, రోగం, మిత్రులవలనకష్టం, ద్రవ్యనష్టం, బుద్ధిమాంద్యత.

6. 6స్థానంలో ఉన్నచో, ధనధాన్యవృద్ధి, ఆరోగ్యం, చేసేపనులలో విజయం, సుఖం.

7. 7స్థానంలో ఉన్నచో, రోగం, ప్రయాణం, భార్యకు పీడ, ద్వేషం, బిడ్డలకు బాధలు, ఉత్సాహ భంగం.

8. 8స్థానంలో ఉన్నచో, ప్రమాదాలు, కలహాలు, విచారం, గర్భరోగం, శతృత్వం, వ్యాకులత.

9. 9స్థానంలో ఉన్నచో, అనవసర కలహాలు, ద్రవ్యనష్టం, మనోవిచారం, అనుకున్నవి జరగవు.

10. 10స్థానంలో ఉన్నచో, కార్యవిజయము, బంధుమిత్ర సుఖం, గొప్పవారి దర్శనం, మంచి సుఖం, ఆదరణ.

11. 11స్థానంలో ఉన్నచో, ద్రవ్యలాభం, గృహ, వాణిజ్యాభివృద్ధి, మంచిసుఖము, ఇంటియందు శుభము.

12. 12స్థానంలో ఉన్నచో, తీవ్ర ఉష్ణతాపం, వృదాసంచారం, ప్రాణాంతకమగు ఆపద, స్థాన, ద్రవ్య, బంధు నష్టము.

రవిగ్రహ శాన్తి:- మంజిష్ఠ, గజమదము, కుంకుమ, రక్తచన్దనము, మొదలగు పదార్థములను, సంపూర్ణమైన రాగి పాత్రలో కలిపి స్నానము చేసినచో రవి దోషము తొలుగ గలదు. అనంతరము వేదోక్తమగు రవిగ్రహ శాన్తి గావించి, రక్త వస్త్రం, బెల్లం, కంచుగుర్రం, రక్తచన్దనం, పద్మములు మొదలగునవి, ఆదివారం నాడు దానం చేసినచో రవికి ప్రీతికరమై రవి గ్రహ దోష శాన్తి చేకూరగలదు.

## గోచార రీత్యా చంద్రుడు ఇచ్చే ఫలములు

1. గోచార రీత్యా చంద్రుడు 1వ స్థానంలో ఉన్నచో మంచితిండి సుఖం, నిద్ర, వస్త్రభూషణ, లాభం, రతి, ఆరోగ్యం, గౌరవం.

2. లగ్నాత్ 2స్థానంలో ఉన్నచో, విఘ్నములు, బాధలు, ధనసామాగ్రి నష్టం, రోగం, అన్నం తప్పవేరే భోజనం.

3. 3స్థానంలో ఉన్నచో, కార్యవిజయము, ఆరోగ్యము, స్త్రీసుఖం, సల్లాపము, ధన, వస్తు, వస్త్ర, భూషణప్రాప్తి.

4. 4స్థానంలో ఉన్నచో, ఆందోళన, మతిమరుపు, సోమరితనం, బంధు మిత్ర కలహం.

5. 5స్థానంలో ఉన్నచో, వాతరోగం, సోమరితనం, మనోవ్యధ, ధననష్టం, భయం, దుర్బలత.

6. 6స్థానంలో ఉన్నచో, ఇంటిలో శుభములు స్వస్థానప్రాప్తి, పుణ్యం, ఆరోగ్యం, కీర్తి, ధనలాభం, స్త్రీసుఖం.

7. 7స్థానంలో ఉన్నచో, పెంపు, సొంపు, ద్రవ్యలాభం, కార్యలాభం, స్త్రీసుఖం, శరీరసుఖం, కార్యసిద్ధి.

8. 8స్థానంలో ఉన్నచో, కంటికి నిద్రకరవు, కలహం, అజీర్ణం, నరాలబాధ, వేదన, ద్రవ్యనష్టం.

9. 9స్థానంలో ఉన్నచో, శతృప్రమాదం, బంధు, మిత్ర, పుత్రవిరోధం, పరస్థల నివాసం, ఉద్యోగంలో కష్టం.

10. 10స్థానంలో ఉన్నచో, అభీష్టసిద్ధి, ఆరోగ్యం, బంధుమిత్రాదులతో పర స్థల నివాసం, ఉద్యోగంలో కష్టం.

11. 11స్థానంలో ఉన్నచో, బంధు, మిత్ర, పుత్రాది వార్తానందం, ఇష్టాగోష్ఠి, మృష్టాన్నం, ధన, ధాన్య, కార్యలాభం.

12. 12స్థానంలో ఉన్నచో, ఖర్చులెక్కువ, మనోవికలత, అవమానం, శరీరశ్రమ, గొప్పఆపద, బంధువైరం, నష్టం.

చంద్రగ్రహ శాన్తి:- వట్టివేళ్ళు, దిరిశపుగంధం, కుంకుమ, రక్తచన్దనం కలిపిన శంఖోదకముచే స్నానమాచరించి, తెల్లని వస్త్రము, బియ్యముతో కూడిన కలశము, ఎద్దు, సోమవారం దానం చేసినచో చన్ద్రగ్రహ దోషం తొలుగగలదు.

## గోచార రీత్యా అంగారకుడు ఇచ్చే ఫలములు

1. గోచార రీత్యా అంగారకుడు 1వ స్థానంలో ఉన్నచో ప్రయాణం, తీవ్ర ఉష్ణ తాపం, శతృభీతి, కార్యభంగం, గాయాలు, భార్య బంధుకలతలు.

2. లగ్నాత్ 2స్థానంలో ఉన్నచో, తేజోహాని, బలహాని, సదామనోవేదన, కార్య, ద్రవ్యభంగం, దుష్టకయిక, ప్రమాదం.

3. 3 స్థానంలో ఉన్నచో, ఆరోగ్యం, ఇష్టసిద్ధి, ఆకస్మిక ధనలాభం, సుఖం, గొప్పవారి చెలిమి, కార్యలాభము.

4. 4స్థానంలో ఉన్నచో, గాయాలు, యంత్రాల ప్రమాదాలు, దుష్టలాభం, అలసట, రోగం,. కార్యహాని, పైత్యభ్రమ.

5. 5స్థానంలో ఉన్నచో, రోగం, తాపం, వేళతప్పిన భోజనం, పాపకర్మ చేయడం వలన సంతాన శతృప్రమాదాలు.

6. 6స్థానంలో ఉన్నచో, ధన, ధాన్య, వస్త్ర, భూషణ, కీర్తిలాభము, మనోల్లాసము, పుణ్యకార్యాచరణ, ఇష్టసిద్ధి.

7. 7స్థానంలో ఉన్నచో, గృహకలతలు, కడుపుకో, కన్నుకో బాధ, ద్రవ్యనష్టం, భ్రాతృ, పుత్ర, బంధుకలహం.

8. 8స్థానంలో ఉన్నచో, ప్రయాణం, కార్యహాని, శ్వాసకోశబాధలు, అవమానం, అప్పులతో ముప్పు.

9. 9స్థానంలో ఉన్నచో, అనుకున్న పనులు కాకపోవడం, అనారోగ్యం, పైవారితో చిక్కులు, స్థానభ్రష్టత, ఇబ్బందులు.

10. 10స్థానంలో ఉన్నచో, అన్నం వంటబట్టదు. ఉద్యోగంలో ప్రయాస, వృధాసంచారము, కించిత్ లాభకరం.

11. 11స్థానంలో ఉన్నచో, అనుకున్నవి జరిగిపోవడం, ధన, వస్త్రాది ప్రాప్తి, సంతోషం, ధైర్యం, సర్వానుకూలత.

12. 12స్థానంలో ఉన్నచో, నేత్రబాధ, కలహం, ఖర్చులెక్కువ, నీలాపనిందలు, శరీరపీడ, పరస్థలసంచారము.

అంగారకగ్రహ శాన్తి:- చంద్రకర్రయొక్క గంధము, దేవదారు గంధము, ఉసిరిక పప్పు, వెండిపాత్ర యందు కలిపి స్నానం వల్ల, అంగారక గ్రహ దోషం శమింపగలదు. పగడం, కందులు, మేక, బెల్లం, బంగారం, ఎర్రని వస్త్రం, రాగి మొదలగునవి మంగళవారం దానం చేసినచో కుజుడు ప్రీతినొంది శాన్తి చేకూర్చును.

## గోచార రీత్యా బుధుడు ఇచ్చే ఫలములు

1. గోచార రీత్యా బుధుడు 1వ స్థానంలో ఉన్నచో విద్యానాశనం, బంధువైరం, అనవసరవివాదాలు, దుష్టజన కలయిక, అకాలభోజనం.

2. లగ్నాత్ 2స్థానంలో ఉన్నచో, మంచిభోజనం, ధనం, కీర్తి, లాభం, సద్గోష్ఠి, సుఖం, ఆరోగ్యం, మంచివారి పరిచయం.

3. 3స్థానంలో ఉన్నచో, శత్రుప్రమాదాలు, ద్రవ్య,బుద్ధినష్టం, అధికారులు, బంధువులతో వైరం.

4. 4స్థానంలో ఉన్నచో, మాతృసుఖం, గృహమందు శుభకార్యాలు, అనుకున్నవి జరగడం, బుద్ధివికాసం, సిద్ధి.

5. 5స్థానంలో ఉన్నచో, మానసికాందోళన, తీవ్ర ఉష్ణతాప, పైత్యప్రకోపం, ఆకస్మికకలహం, అనాదరణ.

6. 6స్థానంలో ఉన్నచో, మాట చెలామణికావడం, విజయం, ధనం, లాభం, విద్యచే ఆనందం, మనోధైర్యము.

7. 7స్థానంలో ఉన్నచో, రాజకోపం, దౌర్భాగ్యం, ప్రేమగల వారినుండి విడిపోవడం, ఉష్ణప్రకంపనము, జడీభూతం.

8. 8స్థానంలో ఉన్నచో, సుఖం, విజయప్రాప్తి, ఆటంకం, రోగం, హృదయతాపము, మనోభీతి, బంధుహాని.

9. 9స్థానంలో ఉన్నచో, సోమరితనం, కీర్తిభంగము, తన తప్పువల్ల ఇతరులకు ఆపదలు, అసత్యం, ఇంపులేని భోజనం.

10. 10స్థానంలో ఉన్నచో, అపవాదు, తిట్లు, భోజన,సుఖహాని, సోమరితనం, సంతాపము, అయిననూ కించిత్‌సుఖం.

11. 11స్థానంలో ఉన్నచో, గృహమందు మంగళకార్యాచరణములు, ధన, కనక, వస్తు, కీర్తిప్రాప్తి, బంధుమిత్రసుఖం.

12. 12స్థానంలో ఉన్నచో, సౌఖ్యహాని, మనోసంకటము, ఆరాటము, పోరాటము, రోగం, కష్టనష్టములు.

బుధగ్రహ శాన్తి:- మట్టిపాత్రలో గజమదమును, నదీసంగమ జలమును కలిపి స్నానము చేయుట వలన బుధగ్రహదోషము శమింపగలదు. ఆకుపచ్చవస్త్రము, తగరం, టంకం, పచ్చ పెసలు, మరకతం, లొట్టిపిట్ట, గజదండము, పుష్పములు, బుధవారం నాడు, దానం చేసినచో బుధగ్రహ దోష శాన్తి చేకూరగలదు.

## గోచార రీత్యా గురుడు ఇచ్చే ఫలములు

1. గోచార రీత్యా గురుడు 1వ స్థానంలో ఉన్నచో ఉద్యోగభంగము, నివాసస్థానం మార్పు, ద్రవ్యనష్టం, వృధాసంచారం, మానసికారాటం.

2. లగ్నాత్ 2స్థానంలో ఉన్నచో, గృహమందు సుఖము, యశోవృద్ధి, సౌభాగ్య, ధనాదాయలాభం, దాన ధర్మాచరణ, మనస్తుష్టి.

3. 3స్థానంలో ఉన్నచో, శ్రమ, బంధువైరం, పౌరుషం, బింకంతప్పుట, ఆకస్మిక ప్రమాదం, దరిద్రం, ఉద్యోగహాని.

4. 4స్థానంలో ఉన్నచో, యాచన, బుదిధహీనత, తేజో, ధనహాని, స్థానభ్రష్టత, తలకుమించిన ఖర్చులు, బంధుమరణం.

5. 5స్థానంలో ఉన్నచో, బంధుమిత్రసుఖం, ధన-కీర్తిలాభం, కార్యానుకూలత, దైవసిద్ధి, మనోసిద్ధి, ఐశ్వర్యం.

6. 6స్థానంలో ఉన్నచో, భార్యాపుత్రాదులవల్ల సుఖం, ధన-కీర్తిలాభం, కార్యానుకూలత, దైవసిద్ధి, మనోసిద్ధి, ఐశ్వర్యం.

7. 7స్థానంలో ఉన్నచో, ఆరోగ్యం, రాజదర్శనం, శరీరసుఖం, ఇష్టకార్యసిద్ధి, చేసే పనులు కలిసిరావడం.

8. 8స్థానంలో ఉన్నచో, ఇంట్లోవిషాదం, అగ్ని-చోర-రాజభయం, హాని, కోపము, అనుకోని ఆపదలు.

9. 9స్థానంలో ఉన్నచో, కులాచార వృత్తిరాణింపు, గృహ-భోజన-తపోలాభం, లాటరీ-రేసులలోవిజయం, స్త్రీసుఖం.

10. 10స్థానంలో ఉన్నచో, చేసేపనుల్లో ఆటంకం, ధన,ధాన్య,వృత్తిభంగం, వృధాప్రయాస, సంచారం, అడియాశలు.

11. 11స్థానంలో ఉన్నచో, ఉద్యోగాభివృద్ధి, లాభము, లాటరీ-రేసులలో లాభం, కీర్తి, తేజో, ఓజో బలవృద్ధి, విజయం.

12. 12స్థానంలో ఉన్నచో, శుభకార్యాల వలన ఖర్చులు, స్త్రీప్రయాణాల వలన ఖర్చులు, స్థాననాశం, వనవాసం.

గురుగ్రహ శాన్తి:- అత్తిచెట్టు, మారేడు, మర్రి, ఉసిరిక మొదలగు వాని ఫలములను బంగారు పాత్రలోని నీటిలో ఉంచి ఆ నీటితో స్నానమాచరించినచో శాన్తి చేకూరును. శనగలు, పుష్యరాగము, పసుపు, పంచదార, ఏనుగు, కనకవర్ణవస్త్రము, సువర్ణం, మొదలగు వస్తువులను గురువారం దానం చేసినచో గురు గ్రహ శాన్తి చేకూరును.

## గోచార రీత్యా శుక్రుడు ఇచ్చే ఫలములు

1. గోచార రీత్యా శుక్రుడు 1వ స్థానంలో ఉన్నచో సుఖం, సంతోషం, పరవశత, ద్రవ్య-భోజనలాభం, ఇష్టకార్యసిద్ధి, పరస్త్రీ సంగమసిద్ధి.

2. లగ్నాత్ 2స్థానంలో ఉన్నచో, ఉత్పత్తి పెరుగుట, కీర్తి, స్త్రీ సల్లాపానందం, ధన, కనక, వస్తు, వాహన, సుఖప్రాప్తి, రతిపోరాటం.

3. 3స్థానంలో ఉన్నచో, వర్తకం, మిత్రుల వలన ధనహాని, జీవనోపాధిభంగము, త్రిప్పుట, ఆరాటం.

4. 4స్థానంలో ఉన్నచో, పుత్ర, మిత్ర, బంధు, వాహన, గృహ, ధనలాభం, ఆనందం, స్త్రీసుఖం, మనోల్లాసము.

5. 5స్థానంలో ఉన్నచో, సంతానసుఖం, తల్లిదండ్రులకు సుఖం, మృష్టాన్నభోజనం, దాసదాసీలు, ధనధాన్య సుఖాలు

6. 6స్థానంలో ఉన్నచో, శతృ, జ్ఞాతివిరోధము, భార్యాపుత్రాదుల వలన ఆరాటము, భార్యకురోగం, రతిహాని.

7. 7స్థానంలో ఉన్నచో, కోపం, తాపం, భయం, స్త్రీరోగములు, మేహరోగం, స్త్రీలతో జగడాలు, ఆరాటం.

8. 8స్థానంలో ఉన్నచో, భూ-సౌధాభివృద్ధి, రతికేళీసుఖానుభూతి, ధన, కీర్తి, సుఖ లాభం, రాజ, బంధు సమాగమము.

9. 9స్థానంలో ఉన్నచో, ధర్మకార్యనిర్వహణ, ప్రేమాయణం, గురు, దేశభక్తి, ఇష్టకార్యసిద్ధి, ఆరోగ్యం, కులవృత్తి.

10. 10స్థానంలో ఉన్నచో, చేసే పనులలో అవాంతరం, ద్రవ్య, బల, స్త్రీ సుఖ బలహీనతలు, శతృభీతి,ఉద్యోగ నిర్వహణలో హాని.

11. 11స్థానంలో ఉన్నచో, గృహసుఖము, పుష్కల సుఖ, కాంతి, కీర్తి, ఆర్ద్ర, ఇష్టసిద్ధి, ఇష్టభోజన, కార్యలాభములు.

12. 12స్థానంలో ఉన్నచో, ఆయుధములచే, యంత్రాదులచే, దొంగలచే బాధలు, చేసేపనులు చెడుట, ఆరాటం, పోరాటం.

శుక్రగ్రహ శాన్తి:- గోరోజనం, గజమదం, శతపుష్ప మొదలగు వానిని రజిత పాత్రస్థ జలములతో స్నానము చేయుట వలన శుక్రగ్రహ దోషోపశమనం కలుగును. బొబ్బర్లు, వజ్రము, శ్వేత వస్త్రములు, సువర్ణం మొదలగు వానిని దానముచేయుటచే శాన్తి చేకూరును.

## గోచార రీత్యా శని ఇచ్చే ఫలములు

1. గోచార రీత్యా శని 1వ స్థానంలో ఉన్నచో బంధు, పత్ని పుత్రాదులకు హాని తేజోహాని, రోగం, ఆరాటం, పోరాటం.

2. లగ్నాత్ 2స్థానంలో ఉన్నచో, అనారోగ్యం పశునష్టం, కుటుంబ కలతలు, ధన, మానహాని, వృధాసంచార భాషణలచే హాని.

3. 3స్థానంలో ఉన్నచో, శక్తిసామర్థ్యాలలకు గుర్తింపు, ధన, కీర్తి, స్వస్థలప్రాప్తి, ప్రయాణ, కార్యవిజయము.

4. 4స్థానంలో ఉన్నచో, అర్ధాష్టమ శని, అనారోగ్యం ఆపద, విచారం, బంధు వ్యధ, మాతృహాని, ప్రసవము.

5. 5స్థానంలో ఉన్నచో, అనుకోని దుస్సంఘటనలు, ఆరాటం, పోరాటం, వ్యాజ్యాలు, హీనస్త్రీపొందు, మనస్తాపం.

6. 6స్థానంలో ఉన్నచో, శత్రుపరాభూతి, ధన ధాన్యవృద్ధి, ఇల్లుకట్టడం, బంధు, స్త్రీజన సంతోషము, కార్యవిజయం.

7. 7స్థానంలో ఉన్నచో, ప్రయాణం, విడిపోవడం, వ్యాధివేదన, దేశాంతరం, ద్రవ్యనష్టం, మహాభయాపదలు.

8. 8స్థానంలో ఉన్నచో, అష్టమశని, అపమృత్యువు, ఆపదలు, స్వజననష్టం, ప్రజావిరోధం, శిక్ష, కక్ష, కష్టనిష్ఠురాలు.

9. 9స్థానంలో ఉన్నచో, ఆదాయహాని, దుఃఖము, వ్యాధి, అనుకున్నవి కాకుండుట, ఒకసారి లాభం మరోసారి నష్టం.

10. 10స్థానంలో ఉన్నచో, వ్యాకులము, దుఃఖము, ఆరాటం, పాపకృత్యాచరణ, ఉద్యోగహాని, కార్యవిఘ్నతలు.

11. 11స్థానంలో ఉన్నచో, లాభం, బహుమానం, స్త్రీసల్లాపము, పుత్రసుఖం, మనోనిర్మలత, ఇచ్ఛాసిద్ధి.

12. 12స్థానంలో ఉన్నచో, ఆపదలు, విఘ్నాలు, ఖర్చులు, విచారం, చేసేపనికి దెబ్బ, వృధాసంచారం.

శనిగ్రహ శాంతి:- మినుములు, కొర్రలు(ప్రియంగు ధాన్యం), నీలగన్ధ పుష్పములు, మొదలగు వానిని లోహపాత్ర జలముతో కలిపి స్నానమాచరించుచున్నచో శనిగ్రహ దోషోపశమనం కల్గును. ఇంద్రనీలం, గారెలు, నువ్వు నూనె, నల్లనువ్వులు, గేదె, ఇనుము, నల్ల ఆవు, శనివారం దానం ఇచ్చినచో శనిగ్రహ దోషోపశమనం కల్గును.

## రాహు కేతువుల విషయము

1. రాహు కేతువులు 3,6,11, స్థానములలో ఉన్నచో ఆయుర్దాయమునిచ్చెదరు.
2. కేతువు 11, 12 స్థానములలో యోగించును.
3. రాహు, కేతువులు, కేంద్ర కోణములలో యోగింతురు.
4. రాహు, కేతువులు, చంద్రునితో కలిసిననూ యోగింతురు.
5. రాహువు శనితోనూ, కేతువు కుజునితోనూ సమానులు.
6. రాహు,కేతువులు శుక్రునితో కలిసినచో యోగభంగము, కళత్రసుఖం తగ్గును.
7. రాహువు వైద్యవిద్యా కారకుడు.
8. శని కేతువుల యోగము శుభప్రదము.
9. రాహువు పంచమ స్థానములో ఉన్నచో సంతాన సుఖానుభవం తక్కువగా ఉండును.
10. లగ్నంలో రాహు,చంద్రులుండుటచే మతిభ్రంశము మొదలగునవి కల్గును.

రాహుగ్రహ శాన్తి:- గుగ్గిలం, ఇంగువ, హరిదళము(అర్ధళము), మణిశిల, మొదలగునవి, నీచ పాత్రయందు గల జలములతో కలిపి స్నానమాచరించుటచే రాహు గ్రహ దోషోపశమనం కల్గును. గోమేధికం, గుర్రం, నీలవస్త్రము, కంబళి, తైలం, మినుములు, లోహము, మొదలగునవి శనివారమునాడు ఉ॥గం॥ 9:00 నుండి 10:30 లోపు దానం చేసినచో రాహు గ్రహ దోషోపశమనం కల్గును.

కేతుగ్రహ శాన్తి:- పంది కొమ్ముచేత త్రవ్విన పర్వతశృంగాగ్ర మట్టియూ, మేక పాలు, నీచ లోహపాత్రస్థ జలములతో కలిపి స్నానమాచరిస్తూ ఉండినచో కేతుగ్రహ దోషోపశమనం కలుగగలదు. వైఢూర్యం, తైలం, శాలి, కస్తూరి, ఉలవలు, మొదలగునవి, మంగళవారమునాడు మధ్యాహ్నము॥ 3:00 నుండి 4:30 లోపు దానం చేయుటచే కేతు గ్రహ దోషోపశమనం కలుగగలదు.



## భోక్త ప్రాయశ్చిత్తం

**శ్లో॥ చతు:స్వస్తి పయ: పంచ షడ్విష్ణోరర్కదైవతమ్।**
**ఏకవింశతి శాన్తిశ్చ భోక్తృదోషం నవిద్యతే॥**

శ్లో॥ ప్రత్యబ్దే త్రిశతంచైవ మాసికే శతపంచకం।
ద్విసహస్రం సపిండేచ అయుతం ప్రేత భోజనం॥

1. ఓం స్వస్తిన ఇంద్రో వృద్ధ . . . . బృహస్పతిర్దధాతు॥
2. ఓం పయ: పృథివ్యాం పయ ఓషధీషు।
   పయో దివ్యన్తరిక్షే పయోధామ్।
   పయస్వతీ: ప్రదిశస్సన్తు మహ్యామ్॥
3. ఓం విష్ణోరరాటమసి . . . విష్ణవేత్వా॥
4. ఓం అగ్నిర్దేవతా వాతోదేవతా . . . . మూర్ధాసిరాట్॥
5. ఓం పృథివీ శాన్తిరన్తరిక్షగ్ం శాన్తిర్ద్యౌశ్శాన్తి . . . . అస్తు శాన్తి:॥

పై మంత్రములచే జలం అభిమంత్రించి మరల పై మంత్రములు పఠిస్తూ జలమును మార్జన చేసుకొనవలెను. తదుపరి,

ఆబ్దిక భోజనం చేసినచో 300గాయత్రీ జపమును, మాసిక భోజనము చేసినచో 500 గాయత్రీ జపమును, సపిండీకరణ భోక్తృత్వం చేసినచో 2000 గాయత్రీ జపము, మరణదినమందు ప్రేతసంస్కారానంతరం భోజనం చేసినచో 10,000గాయత్రీ జపమును ఆచరించవలెనని శాస్త్ర వచనము.

మాసిక/ఆబ్దిక/--/-- భోక్తృత్వ దోష నివృత్యర్థం పంచశత/త్రిశత/--/-- సంఖ్యాక గాయత్రీ మహామంత్ర జపం కరిష్యే, అను సంకల్ప పూర్వకముగా జపము ఆచరించుట వలన బోక్తృత్వ దోష నివృత్తి అగును.



## విశేష శని స్తోత్రము

**శ్లో॥ కోణస్థో పింగళో బభ్రు: కృష్ణో రౌద్రాంతకో యమ:।**
**సౌరీ శనైశ్చరో మంద: పిప్పలాదేన సంస్తుత:॥**
**నమస్తే కోణ సంస్థాయ పింగళాయ నమోస్తుతే।**
**నమస్తే బభ్రు రూపాయ కృష్ణాయచ నమోస్తుతే॥**
**నమస్తే రౌద్రదేహాయ నమస్తేచాంతకాయచ।**
**నమస్తే యమసంగ్నాయ నమస్తే సౌరయే విభో॥**
**నమస్తే యమసంగ్నాయ శనైశ్చర నమోస్తుతే।**
**ప్రసాదం కురు దేవేశ దీనస్య ప్రణతస్యచ॥**

కౌశిక మహర్షి తన కుమారుడిని రావిచెట్టు క్రిందవదిలి వెళ్ళిపోతారు. అందుచే ఆ బాలుడు పిప్పలాద నామధేయుడై, కొంతకాలం జీవనం గడిపి, కాలాంతరమున నారద మహర్షి ఉపదేశముచే నారాయణాష్టాక్షరీ మహామంత్రోపాసన గావించి, మంత్రోపాసన శక్తిచే బాల్యమున తనకు మాతాపితృ వియోగము కలుగుటకు శనిగ్రహ దోషము కారణమని తెలుసుకొని, శని గ్రహమును గ్రహ మండలము నుండి తప్పించగా, దేవతలందరూ ఆ మహర్షిని శాంత పరచి, 16 ఏండ్ల లోపు బాలురకు శని గ్రహ బాధలు కలుగకుండునట్లు శనిచే వరమిప్పించిరి.

శని గ్రహ దోషము అనగా ఏలినాటిశని, అర్ధాష్టమశని, అష్టమ శని ఇత్యాది దోషములు కలవారు పై స్తోత్రమును శనివారము నాడు సూర్యోదయానంతరము విధిగా, శ్రద్ధగా పఠించుటచే శనిగ్రహ దోష నివృత్తి అగును.

శని గ్రహ దోష నివారణకై శని వారము నాడు తెల్లవారుఝామున రుద్రాభిషేకము నువ్వులనూనెతోను మరియూ ఫల రసములతోను చేయించి భస్మాభిషేకము చేయించి అన్నశాన్తి జరిపించుటచే శాన్తి చేకూరును.

శని గ్రహ దోష నివారణకు తిలదానము, గుమ్మడికాయ దానము, ఇనుము దానము, మహిష దానము మున్నగునవి శాస్త్రమునందు చెప్పబడినవి. దేశకాలమానముల రీత్యా పై ద్రవ్యములను దానము చేయుట శ్రేయోదాయకము.

| తేది | మీనం | మేషం | వృషభం | మిథున | కర్కాట | సింహం | కన్య | తుల | వృశ్చికం | ధనస్సు | మకరం | కుంభం |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| 13 | 5-52 | 7-29 | 9-17 | 11-22 | 01-36 | 3-48 | 5-54 | 08-00 | 10-12 | 12-26 | 2-31 | 4-19 |
| తేది | మేషం | వృషభం | మిథున | కర్కాట | సింహం | కన్య | తుల | వృశ్చికం | ధనస్సు | మకరం | కుంభం | మీనం |
| 14 | 7-25 | 9-13 | 11-18 | 01-32 | 3-44 | 5-50 | 7-56 | 10-08 | 12-22 | 2-27 | 4-15 | 5-52 |
| 15 | 7-22 | 9-10 | 11-15 | 01-29 | 3-41 | 5-47 | 7-53 | 10-05 | 12-19 | 2-24 | 4-12 | 5-49 |
| 16 | 7-18 | 09-06 | 11-11 | 01-25 | 3-37 | 5-43 | 7-49 | 10-01 | 12-15 | 2-20 | 4-08 | 5-45 |
| 17 | 7-15 | 09-03 | 11-08 | 01-22 | 3-34 | 5-40 | 7-46 | 9-58 | 12-12 | 2-17 | 4-05 | 5-42 |
| 18 | 7-13 | 09-01 | 11-06 | 01-20 | 3-32 | 5-38 | 7-44 | 9-56 | 12-10 | 2-15 | 4-03 | 5-40 |
| 19 | 7-08 | 8-56 | 11-01 | 01-15 | 3-27 | 5-33 | 7-39 | 09-51 | 12-05 | 2-10 | 3-58 | 5-35 |
| 20 | 7-04 | 8-52 | 10-57 | 01-11 | 3-23 | 5-29 | 7-35 | 09-47 | 12-01 | 2-06 | 3-54 | 5-31 |
| 21 | 7-00 | 8-48 | 10-53 | 01-07 | 3-19 | 5-25 | 7-31 | 09-43 | 11-57 | 2-02 | 3-50 | 5-27 |
| 22 | 6-57 | 8-45 | 10-50 | 01-04 | 3-16 | 5-22 | 7-28 | 09-40 | 11-54 | 1-59 | 3-47 | 5-24 |
| 23 | 6-53 | 8-41 | 10-46 | 01-00 | 3-12 | 5-18 | 7-24 | 09-36 | 11-50 | 1-55 | 3-43 | 5-20 |
| 24 | 6-50 | 8-38 | 10-43 | 12-57 | 3-09 | 5-15 | 7-21 | 09-33 | 11-47 | 1-52 | 3-40 | 5-17 |
| 25 | 6-47 | 8-35 | 10-40 | 12-54 | 3-06 | 5-12 | 7-18 | 09-30 | 11-44 | 1-49 | 3-37 | 5-14 |
| 26 | 6-42 | 8-30 | 10-35 | 12-49 | 3-01 | 5-07 | 7-13 | 09-25 | 11-39 | 1-44 | 3-32 | 5-09 |
| 27 | 6-40 | 8-28 | 10-33 | 12-47 | 2-59 | 5-05 | 7-11 | 09-23 | 11-37 | 1-42 | 3-30 | 5-07 |
| 28 | 6-35 | 8-23 | 10-28 | 12-42 | 2-54 | 5-00 | 7-06 | 09-18 | 11-32 | 1-37 | 3-25 | 5-02 |

ఏప్రియల్ మే-2021

| తేది | మేషం | వృషభం | మిథున | కర్కాట | సింహం | కన్య | తుల | వృశ్చికం | ధనస్సు | మకరం | కుంభం | మీనం |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| 29 | 6-33 | 8-21 | 10-26 | 12-40 | 2-52 | 4-56 | 7-04 | 09-16 | 11-30 | 1-35 | 3-23 | 5-00 |
| 30 | 6-29 | 8-17 | 10-22 | 12-36 | 2-48 | 4-52 | 7-00 | 09-12 | 11-26 | 1-31 | 3-19 | 4-56 |
| మే1 | 6-25 | 8-13 | 10-18 | 12-32 | 2-44 | 4-48 | 6-56 | 09-08 | 11-22 | 1-27 | 3-15 | 4-52 |
| 2 | 6-22 | 8-10 | 10-15 | 12-29 | 2-41 | 4-45 | 6-53 | 09-05 | 11-19 | 1-24 | 3-12 | 4-49 |
| 3 | 6-18 | 8-06 | 10-11 | 12-25 | 2-37 | 4-41 | 6-49 | 09-01 | 11-15 | 1-20 | 3-08 | 4-45 |
| 4 | 6-15 | 8-03 | 10-08 | 12-22 | 2-34 | 4-38 | 6-46 | 08-58 | 11-12 | 1-17 | 3-05 | 4-42 |
| 5 | 6-11 | 7-59 | 10-04 | 12-18 | 2-30 | 4-34 | 6-42 | 08-54 | 11-08 | 1-13 | 3-01 | 4-38 |
| 6 | 6-07 | 7-55 | 10-00 | 12-14 | 2-26 | 4-30 | 6-38 | 08-50 | 11-04 | 1-09 | 02-57 | 4-34 |
| 7 | 6-04 | 7-52 | 09-57 | 12-11 | 2-23 | 4-27 | 6-35 | 08-47 | 11-01 | 1-06 | 02-54 | 4-31 |
| 8 | 6-00 | 7-48 | 09-53 | 12-07 | 2-19 | 4-23 | 6-31 | 08-43 | 10-57 | 1-02 | 02-50 | 4-27 |
| 9 | 5-57 | 7-45 | 09-50 | 12-04 | 2-16 | 4-20 | 6-28 | 08-40 | 10-54 | 12-59 | 02-47 | 4-24 |
| 10 | 5-53 | 7-41 | 09-46 | 12-00 | 2-12 | 4-16 | 6-24 | 08-36 | 10-50 | 12-55 | 02-43 | 4-20 |
| 11 | 5-49 | 7-37 | 09-42 | 11-56 | 2-08 | 4-12 | 6-20 | 08-32 | 10-46 | 12-51 | 02-39 | 4-16 |
| 12 | 5-46 | 7-34 | 09-39 | 11-53 | 2-05 | 4-09 | 6-17 | 08-29 | 10-43 | 12-48 | 02-36 | 4-13 |
| 13 | 5-43 | 7-31 | 09-36 | 11-50 | 2-02 | 4-06 | 6-14 | 08-26 | 10-40 | 12-45 | 02-33 | 4-10 |
| 14 | 5-40 | 7-28 | 09-33 | 11-47 | 1-59 | 4-03 | 6-11 | 08-23 | 10-37 | 12-42 | 02-30 | 4-07 |

| తేది | వృషభం | మిథున | కర్కాట | సింహం | కన్య | తుల | వృశ్చికం | ధనస్సు | మకరం | కుంభం | మీనం | మేషం |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| 15 | 7-25 | 9-30 | 11-44 | 1-56 | 4-02 | 6-08 | 8-20 | 10-34 | 12-39 | 2-27 | 4-04 | 5-41 |
| 16 | 7-20 | 9-25 | 11-39 | 1-51 | 3-57 | 6-03 | 8-15 | 10-29 | 12-34 | 2-22 | 3-59 | 5-36 |
| 17 | 7-17 | 9-22 | 11-36 | 1-48 | 3-54 | 6-00 | 8-12 | 10-26 | 12-31 | 2-19 | 3-56 | 5-33 |
| 18 | 7-12 | 9-17 | 11-31 | 1-43 | 3-49 | 5-55 | 8-07 | 10-21 | 12-26 | 2-14 | 3-51 | 5-28 |
| 19 | 7-09 | 9-14 | 11-28 | 1-40 | 3-46 | 5-52 | 8-04 | 10-18 | 12-23 | 2-11 | 3-48 | 5-25 |
| 20 | 7-05 | 9-10 | 11-24 | 1-36 | 3-42 | 5-48 | 8-00 | 10-14 | 12-19 | 2-07 | 3-44 | 5-21 |
| 21 | 7-00 | 9-05 | 11-19 | 1-31 | 3-37 | 5-43 | 7-55 | 10-09 | 12-14 | 2-02 | 3-39 | 5-16 |
| 22 | 6-57 | 9-02 | 11-16 | 1-28 | 3-34 | 5-40 | 7-52 | 10-06 | 12-11 | 1-59 | 3-36 | 5-13 |
| 23 | 6-54 | 8-59 | 11-13 | 1-25 | 3-31 | 5-37 | 7-49 | 10-03 | 12-08 | 1-56 | 3-33 | 5-10 |
| 24 | 6-51 | 8-56 | 11-10 | 1-22 | 3-28 | 5-34 | 7-46 | 10-00 | 12-05 | 1-53 | 3-30 | 5-07 |
| 25 | 6-47 | 8-52 | 11-06 | 1-18 | 3-24 | 5-30 | 7-42 | 09-56 | 12-01 | 1-49 | 3-26 | 5-03 |
| 26 | 6-43 | 8-48 | 11-02 | 1-14 | 3-20 | 5-26 | 7-38 | 09-52 | 11-57 | 1-45 | 3-22 | 4-59 |
| 27 | 6-39 | 8-44 | 10-58 | 1-10 | 3-16 | 5-22 | 7-34 | 09-48 | 11-53 | 1-41 | 3-18 | 4-55 |
| 28 | 6-35 | 8-40 | 10-54 | 1-06 | 3-12 | 5-18 | 7-30 | 09-44 | 11-49 | 1-37 | 3-14 | 4-51 |
| 29 | 6-32 | 8-37 | 10-51 | 1-03 | 3-09 | 5-15 | 7-27 | 09-41 | 11-46 | 1-34 | 3-11 | 4-48 |
| 30 | 6-28 | 8-33 | 10-47 | 12-59 | 3-05 | 5-11 | 7-23 | 09-37 | 11-42 | 1-30 | 3-07 | 4-44 |
| 31 | 6-25 | 8-30 | 10-44 | 12-56 | 3-02 | 5-08 | 7-20 | 09-34 | 11-39 | 1-27 | 3-04 | 4-41 |

| తేది | వృషభం | మిథున | కర్కాట | సింహం | కన్య | తుల | వృశ్చికం | ధనస్సు | మకరం | కుంభం | మీనం | మేషం |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| 1 | 6-20 | 8-25 | 10-39 | 12-51 | 2-57 | 5-03 | 7-15 | 09-29 | 11-34 | 1-22 | 2-59 | 4-36 |
| 2 | 6-17 | 8-22 | 10-36 | 12-48 | 2-54 | 5-00 | 7-12 | 09-26 | 11-31 | 1-19 | 2-56 | 4-33 |
| 3 | 6-14 | 8-19 | 10-33 | 12-45 | 2-51 | 4-57 | 7-09 | 09-23 | 11-28 | 1-16 | 2-53 | 4-30 |
| 4 | 6-11 | 8-16 | 10-30 | 12-42 | 2-48 | 4-54 | 7-06 | 09-20 | 11-25 | 1-13 | 2-50 | 4-27 |
| 5 | 6-07 | 8-12 | 10-26 | 12-38 | 2-44 | 4-50 | 7-02 | 09-16 | 11-21 | 1-09 | 2-46 | 4-23 |
| 6 | 6-03 | 8-08 | 10-22 | 12-34 | 2-40 | 4-46 | 6-58 | 09-12 | 11-17 | 1-05 | 1-42 | 4-19 |
| 7 | 5-59 | 8-04 | 10-18 | 12-30 | 2-36 | 4-42 | 6-54 | 09-08 | 11-13 | 1-01 | 1-38 | 4-15 |
| 8 | 5-56 | 8-01 | 10-15 | 12-27 | 2-33 | 4-39 | 6-51 | 09-05 | 11-10 | 12-58 | 1-35 | 4-12 |
| 9 | 5-52 | 7-57 | 10-11 | 12-23 | 2-29 | 4-35 | 6-47 | 09-01 | 11-06 | 12-54 | 1-31 | 4-08 |
| 10 | 5-48 | 7-53 | 10-07 | 12-19 | 2-25 | 4-31 | 6-43 | 08-57 | 11-02 | 12-50 | 1-27 | 4-04 |
| 11 | 5-45 | 7-50 | 10-04 | 12-16 | 2-22 | 4-28 | 6-40 | 08-54 | 10-59 | 12-47 | 1-24 | 4-01 |
| 12 | 5-42 | 7-47 | 10-01 | 12-13 | 2-19 | 4-25 | 6-37 | 08-51 | 10-56 | 12-44 | 1-21 | 3-58 |
| 13 | 5-39 | 7-44 | 09-58 | 12-10 | 2-16 | 4-22 | 6-34 | 08-48 | 10-53 | 12-41 | 1-18 | 3-55 |
| 14 | 5-35 | 7-40 | 09-54 | 12-06 | 2-12 | 4-18 | 6-30 | 08-44 | 10-49 | 12-37 | 1-14 | 3-51 |
| 15 | 5-31 | 7-36 | 09-50 | 12-02 | 2-08 | 4-14 | 6-26 | 08-40 | 10-45 | 12-33 | 1-10 | 3-47 |
| తేది | మిథున | కర్కాట | సింహం | కన్య | తుల | వృశ్చికం | ధనస్సు | మకరం | కుంభం | మీనం | మేషం | వృషభ |
| 16 | 7-32 | 9-46 | 11-58 | 2-04 | 4-10 | 6-22 | 8-36 | 10-41 | 12-29 | 2-06 | 3-43 | 5-31 |

జూన్-2021

జులై-2021

| తేది | మిథున | కర్కాట | సింహం | కన్య | తుల | వృశ్చికం | ధనస్సు | మకరం | కుంభం | మీనం | మేషం | వృషభ |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| 17 | 7-28 | 9-42 | 11-54 | 2-00 | 4-06 | 6-18 | 8-32 | 10-37 | 12-25 | 2-02 | 3-39 | 5-27 |
| 18 | 7-24 | 9-38 | 11-50 | 1-56 | 4-02 | 6-14 | 8-28 | 10-33 | 12-21 | 1-58 | 3-35 | 5-23 |
| 19 | 7-20 | 9-34 | 11-46 | 1-52 | 3-58 | 6-10 | 8-24 | 10-29 | 12-17 | 1-54 | 3-31 | 5-19 |
| 20 | 7-16 | 9-30 | 11-42 | 1-48 | 3-54 | 6-06 | 8-20 | 10-25 | 12-13 | 1-50 | 3-27 | 5-15 |
| 21 | 7-11 | 9-25 | 11-37 | 1-43 | 3-49 | 6-01 | 8-15 | 10-21 | 12-08 | 1-45 | 3-22 | 5-10 |
| 22 | 7-08 | 9-22 | 11-34 | 1-40 | 3-46 | 5-58 | 8-12 | 10-18 | 12-05 | 1-42 | 3-19 | 5-07 |
| 23 | 7-04 | 9-18 | 11-30 | 1-36 | 3-42 | 5-54 | 8-08 | 10-14 | 12-01 | 1-38 | 3-15 | 5-03 |
| 24 | 7-00 | 9-14 | 11-26 | 1-32 | 3-38 | 5-50 | 8-04 | 10-10 | 11-57 | 1-34 | 3-11 | 4-59 |
| 25 | 6-56 | 9-10 | 11-22 | 1-28 | 3-34 | 5-46 | 8-00 | 10-06 | 11-53 | 1-30 | 3-07 | 4-55 |
| 26 | 6-52 | 9-06 | 11-18 | 1-24 | 3-30 | 5-42 | 7-56 | 10-02 | 11-49 | 1-26 | 3-03 | 4-51 |
| 27 | 6-48 | 9-02 | 11-14 | 1-20 | 3-26 | 5-38 | 7-52 | 09-58 | 11-45 | 1-22 | 02-59 | 4-47 |
| 28 | 6-44 | 08-58 | 11-10 | 1-16 | 3-22 | 5-34 | 7-48 | 09-54 | 11-41 | 1-18 | 02-55 | 4-43 |
| 29 | 6-40 | 08-54 | 11-06 | 1-12 | 3-18 | 5-30 | 7-44 | 9-50 | 11-37 | 1-14 | 2-51 | 4-39 |
| 30 | 6-36 | 08-50 | 11-02 | 1-08 | 3-14 | 5-26 | 7-40 | 9-46 | 11-33 | 1-10 | 2-47 | 4-35 |
| 1 | 6-33 | 8-47 | 10-59 | 1-05 | 3-11 | 5-23 | 7-37 | 9-42 | 11-30 | 1-07 | 2-44 | 4-32 |
| 2 | 6-29 | 8-43 | 10-55 | 1-01 | 3-07 | 5-19 | 7-33 | 9-38 | 11-26 | 1-03 | 2-40 | 4-28 |
| 3 | 6-25 | 8-39 | 10-51 | 12-57 | 3-03 | 5-15 | 7-29 | 9-34 | 11-22 | 12-59 | 2-36 | 4-24 |

| తేది | మిథున | కర్కాట | సింహం | కన్య | తుల | వృశ్చికం | ధనస్సు | మకరం | కుంభం | మీనం | మేషం | వృషభ |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| 4 | 6-21 | 8-35 | 10-47 | 12-53 | 2-59 | 5-11 | 7-25 | 9-30 | 11-18 | 12-55 | 2-32 | 4-20 |
| 5 | 6-18 | 8-32 | 10-44 | 12-50 | 2-56 | 5-08 | 7-22 | 9-27 | 11-15 | 12-52 | 2-29 | 4-17 |
| 6 | 6-15 | 8-29 | 10-41 | 12-47 | 2-53 | 5-05 | 7-19 | 9-24 | 11-12 | 12-49 | 2-26 | 4-14 |
| 7 | 6-12 | 8-26 | 10-38 | 12-44 | 2-50 | 5-02 | 7-16 | 9-21 | 11-09 | 12-46 | 2-23 | 4-11 |
| 8 | 6-8 | 8-22 | 10-34 | 12-40 | 2-46 | 4-58 | 7-12 | 9-17 | 11-05 | 12-42 | 2-19 | 4-07 |
| 9 | 6-4 | 8-18 | 10-30 | 12-36 | 2-42 | 4-54 | 7-08 | 9-13 | 11-01 | 12-38 | 2-15 | 4-03 |
| 10 | 6-00 | 8-14 | 10-26 | 12-32 | 2-38 | 4-50 | 7-04 | 9-09 | 10-57 | 12-34 | 2-11 | 3-59 |
| 11 | 5-56 | 8-10 | 10-22 | 12-28 | 2-34 | 4-46 | 7-00 | 9-05 | 10-53 | 12-30 | 2-07 | 3-55 |
| 12 | 5-52 | 8-06 | 10-18 | 12-24 | 2-30 | 4-42 | 06-56 | 9-01 | 10-49 | 12-26 | 2-03 | 3-51 |
| 13 | 5-48 | 8-02 | 10-14 | 12-20 | 2-26 | 4-38 | 06-52 | 8-57 | 10-45 | 12-22 | 01-59 | 3-47 |
| 14 | 5-44 | 7-58 | 10-10 | 12-16 | 2-22 | 4-34 | 06-48 | 8-53 | 10-41 | 12-18 | 01-55 | 3-43 |
| 15 | 5-39 | 7-53 | 10-05 | 12-11 | 2-17 | 4-29 | 06-43 | 8-48 | 10-36 | 12-13 | 01-50 | 3-38 |
| 16 | 5-37 | 7-51 | 10-03 | 12-09 | 2-15 | 4-27 | 06-41 | 8-46 | 10-34 | 12-11 | 01-48 | 3-36 |
| తేది | కర్కాట | సింహం | కన్య | తుల | వృశ్చికం | ధనస్సు | మకరం | కుంభం | మీనం | మేషం | వృషభ | మిథున |
| 17 | 7-47 | 9-59 | 12-05 | 2-11 | 4-23 | 6-37 | 8-42 | 10-30 | 12-07 | 1-44 | 3-32 | 5-37 |
| 18 | 7-43 | 9-55 | 12-01 | 2-07 | 4-19 | 6-33 | 8-38 | 10-26 | 12-03 | 1-40 | 3-28 | 5-33 |
| 19 | 7-39 | 9-51 | 11-57 | 2-03 | 2-15 | 6-29 | 8-34 | 10-22 | 11-59 | 1-36 | 3-24 | 5-29 |

జులై-2021
అగస్టు-2021

| తేది | కర్కాటక | సింహం | కన్య | తుల | వృశ్చికం | ధనస్సు | మకరం | కుంభం | మీనం | మేషం | వృషభ | మిథున |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| 20 | 7-35 | 09-47 | 11-53 | 1-59 | 2-11 | 6-25 | 8-30 | 10-18 | 11-55 | 1-32 | 3-20 | 5-25 |
| 21 | 7-32 | 09-44 | 11-50 | 1-56 | 2-08 | 6-22 | 8-27 | 10-15 | 11-52 | 1-29 | 3-17 | 5-22 |
| 22 | 7-28 | 09-40 | 11-46 | 1-52 | 2-04 | 6-18 | 8-23 | 10-11 | 11-48 | 1-25 | 3-13 | 5-18 |
| 23 | 7-25 | 09-37 | 11-43 | 1-49 | 2-01 | 6-15 | 8-20 | 10-08 | 11-45 | 1-22 | 3-10 | 5-15 |
| 24 | 7-21 | 09-33 | 11-39 | 1-45 | 1-57 | 6-11 | 8-16 | 10-04 | 11-41 | 1-18 | 3-06 | 5-11 |
| 25 | 7-17 | 09-29 | 11-35 | 1-41 | 1-53 | 6-07 | 8-12 | 10-00 | 11-37 | 1-14 | 3-02 | 5-07 |
| 26 | 7-14 | 09-26 | 11-32 | 1-38 | 1-50 | 6-04 | 8-09 | 09-57 | 11-34 | 1-11 | 2-59 | 5-04 |
| 27 | 7-10 | 09-22 | 11-28 | 1-34 | 1-46 | 6-00 | 8-05 | 9-53 | 11-30 | 1-07 | 2-55 | 5-00 |
| 28 | 7-6 | 09-18 | 11-24 | 1-30 | 1-42 | 5-56 | 8-01 | 9-49 | 11-26 | 1-03 | 2-51 | 4-56 |
| 29 | 7-1 | 09-13 | 11-19 | 1-25 | 1-37 | 5-51 | 7-56 | 9-44 | 11-21 | 12-58 | 2-46 | 4-51 |
| 30 | 6-57 | 09-09 | 11-15 | 1-21 | 1-33 | 5-47 | 7-52 | 9-40 | 11-17 | 12-54 | 2-42 | 4-47 |
| 31 | 6-53 | 09-05 | 11-11 | 1-17 | 1-29 | 5-43 | 7-48 | 9-36 | 11-13 | 12-50 | 2-38 | 4-43 |
| 1 | 6-48 | 9-00 | 11-06 | 1-12 | 3-24 | 5-38 | 7-43 | 9-31 | 11-08 | 12-45 | 2-33 | 4-38 |
| 2 | 6-45 | 08-57 | 11-03 | 1-09 | 3-21 | 5-35 | 7-40 | 9-28 | 11-05 | 12-42 | 2-30 | 4-35 |
| 3 | 6-40 | 08-52 | 10-58 | 1-04 | 3-16 | 5-30 | 7-35 | 9-23 | 11-00 | 12-37 | 2-25 | 4-30 |
| 4 | 6-36 | 08-48 | 10-54 | 1-00 | 3-12 | 5-26 | 7-31 | 9-19 | 10-56 | 12-33 | 2-21 | 4-26 |
| 5 | 6-33 | 08-45 | 10-51 | 12-57 | 3-09 | 5-23 | 7-28 | 9-16 | 10-53 | 12-30 | 2-18 | 4-23 |

| తేది | కర్కాట | సింహం | కన్య | తుల | వృశ్చికం | ధనస్సు | మకరం | కుంభం | మీనం | మేషం | వృషభ | మిథున |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| 6 | 6-28 | 08-40 | 10-46 | 12-52 | 3-04 | 5-18 | 7-23 | 9-11 | 10-48 | 12-25 | 2-13 | 4-18 |
| 7 | 6-24 | 08-36 | 10-42 | 12-48 | 3-00 | 5-14 | 7-19 | 9-07 | 10-44 | 12-21 | 2-09 | 4-14 |
| 8 | 6-20 | 08-32 | 10-38 | 12-44 | 2-56 | 5-10 | 7-15 | 9-03 | 10-40 | 12-17 | 2-05 | 4-10 |
| 9 | 6-16 | 8-28 | 10-34 | 12-40 | 2-52 | 5-06 | 7-11 | 8-59 | 10-36 | 12-13 | 2-01 | 4-06 |
| 10 | 6-13 | 8-25 | 10-31 | 12-37 | 2-49 | 5-03 | 7-08 | 8-56 | 10-33 | 12-10 | 1-58 | 4-03 |
| 11 | 6-09 | 8-21 | 10-27 | 12-33 | 2-45 | 4-59 | 7-04 | 8-52 | 10-29 | 12-06 | 1-54 | 3-59 |
| 12 | 6-05 | 8-17 | 10-23 | 12-29 | 2-41 | 4-55 | 7-00 | 8-48 | 10-25 | 12-02 | 1-50 | 3-55 |
| 13 | 06-00 | 8-12 | 10-18 | 12-24 | 2-36 | 4-50 | 6-55 | 8-43 | 10-20 | 11-57 | 1-45 | 3-50 |
| 14 | 5-57 | 8-09 | 10-15 | 12-21 | 2-33 | 4-47 | 6-52 | 8-40 | 10-17 | 11-54 | 1-42 | 3-47 |
| 15 | 5-53 | 5-05 | 10-11 | 12-17 | 2-29 | 4-43 | 6-48 | 8-36 | 10-13 | 11-50 | 1-38 | 3-43 |
| 16 | 5-50 | 5-02 | 10-08 | 12-14 | 2-26 | 4-40 | 6-45 | 8-33 | 10-10 | 11-47 | 1-35 | 3-40 |
| 17 | 5-46 | 4-58 | 10-04 | 12-10 | 2-22 | 4-36 | 6-41 | 8-29 | 10-06 | 11-43 | 1-31 | 3-36 |
| తేది | సింహం | కన్య | తుల | వృశ్చికం | ధనస్సు | మకరం | కుంభం | మీనం | మేషం | వృషభ | మిథున | కర్కాట |
| 18 | 7-54 | 9-00 | 11-06 | 1-18 | 3-32 | 5-37 | 7-25 | 9-02 | 10-39 | 12-27 | 2-32 | 4-46 |
| 19 | 7-50 | 8-56 | 11-02 | 1-14 | 3-28 | 5-33 | 7-21 | 8-58 | 10-35 | 12-23 | 2-28 | 4-42 |
| 20 | 7-45 | 8-51 | 10-57 | 1-09 | 3-23 | 5-28 | 7-16 | 8-53 | 10-30 | 12-18 | 2-23 | 4-37 |
| 21 | 7-43 | 8-49 | 10-55 | 1-07 | 3-21 | 5-26 | 7-14 | 8-51 | 10-28 | 12-16 | 2-21 | 4-35 |

| తేది | సింహం | కన్య | తుల | వృశ్చికం | ధనస్సు | మకరం | కుంభం | మీనం | మేషం | వృషభ | మిథున | కర్కాట |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| 22 | 7-39 | 8-45 | 10-51 | 1-03 | 3-17 | 5-22 | 7-10 | 8-47 | 10-24 | 12-12 | 2-17 | 4-31 |
| 23 | 7-36 | 8-42 | 10-48 | 1-00 | 3-14 | 5-19 | 7-07 | 8-44 | 10-21 | 12-09 | 2-14 | 4-28 |
| 24 | 7-32 | 8-38 | 10-44 | 12-56 | 3-10 | 5-15 | 7-03 | 8-40 | 10-17 | 12-05 | 2-10 | 4-24 |
| 25 | 7-27 | 8-33 | 10-39 | 12-51 | 3-05 | 5-10 | 6-58 | 8-35 | 10-12 | 12-00 | 2-05 | 4-19 |
| 26 | 7-24 | 8-30 | 10-36 | 12-48 | 3-02 | 5-07 | 6-55 | 8-32 | 10-09 | 11-57 | 2-02 | 4-16 |
| 27 | 7-19 | 8-25 | 10-31 | 12-43 | 2-57 | 5-02 | 6-50 | 8-27 | 10-04 | 11-52 | 1-57 | 4-11 |
| 28 | 7-16 | 8-22 | 10-28 | 12-40 | 2-54 | 4-59 | 6-47 | 8-24 | 10-01 | 11-49 | 1-54 | 4-08 |
| 29 | 7-11 | 8-17 | 10-23 | 12-35 | 2-49 | 4-54 | 6-42 | 8-19 | 09-56 | 11-44 | 1-49 | 4-03 |
| 30 | 7-07 | 8-13 | 10-19 | 12-31 | 2-45 | 4-50 | 6-38 | 8-15 | 09-52 | 11-40 | 1-45 | 3-59 |
| 31 | 7-03 | 8-09 | 10-15 | 12-27 | 2-41 | 4-46 | 6-34 | 8-11 | 09-48 | 11-36 | 1-41 | 3-55 |
| 1 | 6-59 | 8-05 | 10-11 | 12-23 | 2-37 | 4-42 | 6-30 | 8-07 | 09-44 | 11-32 | 1-37 | 3-51 |
| 2 | 6-55 | 8-01 | 10-07 | 12-19 | 2-33 | 4-38 | 6-26 | 8-03 | 09-40 | 11-28 | 1-33 | 3-47 |
| 3 | 6-51 | 7-57 | 10-03 | 12-15 | 2-29 | 4-34 | 6-22 | 7-59 | 09-36 | 11-24 | 1-29 | 3-43 |
| 4 | 6-47 | 7-53 | 09-59 | 12-11 | 2-25 | 4-30 | 6-18 | 7-55 | 09-32 | 11-20 | 1-25 | 3-39 |
| 5 | 6-44 | 7-50 | 09-56 | 12-08 | 2-22 | 4-27 | 6-15 | 7-52 | 09-29 | 11-17 | 1-22 | 3-36 |
| 6 | 6-41 | 7-47 | 09-53 | 12-05 | 2-19 | 4-24 | 6-12 | 7-49 | 09-26 | 11-14 | 1-19 | 3-33 |
| 7 | 6-37 | 7-43 | 09-49 | 12-01 | 2-15 | 4-20 | 6-08 | 7-45 | 09-22 | 11-10 | 1-15 | 3-29 |

ఆగస్టు-2021

సెప్టెంబర్-2021

